ఆంధ్రసచిత్రవారపత్రిక
ప్రతి శుక్రవారం | కొత్త సీరియల్స్‌తో, వ్యంగ్య చిత్రాలతో, తాజా సినీవార్తలతో వెలువడుచున్నది | తప్పక చదవండి

ఉదయం

PUBLISHED SIMULTANEOUSLY FROM MADRAS & VIJAYAWADA

విజయవాడ
బుధవారం
20—11—1974
THE ANDHRA PATRIKA
Regd. H / VJ. No. 49

# ఆంధ్రపత్రిక

FOUNDER: DESODHARAKA K. NAGESWARA RAO

సంపుటం: 61
సంచిక: 225
పుటలు: 4
వెల: 25 పైసలు




## ఈయేడు పంచదార ఎగుమతి ద్వారా 250 కోట్లు ఆర్జన

న్యూఢిల్లీ, నవంబరు 19: ఈ సంవత్సరం పంచదార ఎగుమతుల వలన 240 కోట్ల నుండి 250 కోట్ల రూపాయల వరకు ఆదాయం లభించవచ్చునని కేంద్ర వాణిజ్య మంత్రి శ్రీ డి. పి. చటోపాధ్యాయ నేడు రాజ్యసభలో తెలియజేశారు.

శ్రీ ఎ. జి. కులకర్ణి, శ్రీ జగదీష్‌జోషి వేసిన ప్రశ్నలకు మంత్రి సమాధానంచెబుతూ యిప్పటి కప్పుడే 3.30 లక్షల టన్నుల పంచదార ఎగుమతి జరిగినట్లు తెలియజేశారు. 1973 లో 42.20 కోట్ల రూపాయల పంచదార ఎగుమతి జరిగినట్లు మంత్రి తెలిపారు.

ఎక్కువ పంచదారను ఎగుమతిచేయాలంటే దేశంలోని మార్కెటునుండి పంచదారను మళ్ళించవలసి వుంటుందని మంత్రి తెలియజేశారు. అంతర్జాతీయ మార్కెటులో యిప్పుడు భారత్ పంచదారకు మంచి ధర లభిస్తున్నదని టన్ను ధర 470 పౌనులవరకు లభిస్తున్నదని మంత్రి తెలియజేశారు. భారత్ కనుక అత్యుత్తమ రకం పంచదారను ఉత్పత్తి చేయగలిగితే టన్నుకు 600 పౌన్ల వరకు ధర లభిస్తుందని ఆయన తెలిపారు.

ప్రభుత్వం అనుసరిస్తున్న పంచదార విధానాన్ని శ్రీ రాదిరే, డా. జడ్. ఎ. అహ్మద్‌లు విమర్శించారు.

## చక్కెర పరిశ్రమ భవిష్యత్తు: కేంద్రం పరిశీలన

న్యూఢిల్లీ, నవంబరు 19: చక్కెర పరిశ్రమ దర్యాప్తు సంఘం సిఫార్సులదృష్ట్యా ఆ పరిశ్రమ జాతీయకరణ సమస్యను ప్రభుత్వం ఇంకా పరిశీలిస్తున్నట్లు వ్యవసాయ శాఖలో మంత్రి శ్రీ షనవాజఖాన్ లోక్‌సభలో చెప్పారు. చక్కెరపై పాక్షిక కంట్రోలును ఎత్తివేసే ప్రతిపాదన ఏదీ లేదని కూడా ఆయన వివరించారు.

## రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్‌కు హైద్రాబాద్‌లో ఘనస్వాగతం

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాదు, నవంబరు 19: రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్‌అలీఅహ్మద్ నేటి మధ్యాహ్నం ఢిల్లీ నుంచి హైదరాబాద్‌కు సతీ సమేతంగా వచ్చినప్పుడు, వారికి అపూర్వమైన స్వాగతం ఇవ్వబడింది.

రాష్ట్రపతి వచ్చిన రాజదూత్ విమానం మధ్యాహ్నం 1—25 గం. లకు హైదరాబాద్ విమానాశ్రయంలో దిగింది. విమానం నుంచి వారు దిగడంతోటే ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు, ఆయన సతీమణి శ్రీమతి వెంగాయమ్మ వారికి పుష్పమాలలు సమర్పించారు. ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ వీరమాచనేని వెంకటనారాయణ రాష్ట్రపతికి పుష్పహారం సమర్పించారు.

రాష్ట్రపతి హైనిజాభివందనం స్వీకరించారు.

ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ప్రత్యేకంగా నిర్మించిన పందిరిలో రాష్ట్రపతికి మంత్రులను హైకోర్టు ప్రధానన్యాయమూర్తి శ్రీ ఎస్. ఓబులరెడ్డి, న్యాయమూర్తులు, శాసన మండలి అధ్యక్షులు శ్రీ ..., పార్లమెంటు సభ్యులు, శాసనసభ్యులు, ... ఐ. ఎ. ఎస్. అధికారులు, ఇతర అధికారులను పరిచయం చేశారు.

[illegible]

## మరికొన్ని విజ్ఞానశాస్త్ర రంగాలలో భారత్, రష్యా సహకారానికి ఒప్పందం

[illegible]

"ఎన్.జి.వో.ల కోర్కెలన్నీ ఎలా ఒలా తీర్చవచ్చు కాని, కిలో బియ్యం రూపాయకి శంఖుస్థాలో సరఫరా చెయ్యగలమ్మా అవి!"

## రాష్ట్రపతి ఉత్తర్వుల ద్వారా ప్రాథమిక హక్కుల హరింపు

—జయప్రకాశ్ నిశిత విమర్శ

పాట్నా, నవంబరు 19: తాను, శ్రీ అటల్ బీహారీ వాజపాయ్ ఫాసిస్టులమని, అమెరికా ఏజెంట్లమని, ప్రజాస్వామ్య పరిరక్షకులుగా చెప్పుకుంటున్నవారు చేస్తున్న నిందాపూర్వకమయిన వివాదాలకు తాను జవాబు యివ్వ దలచుకోలేదని సర్వోదయ నాయకుడు శ్రీ జయప్రకాశ్‌నారాయణ్ గతరాత్రి యిక్కడ జరిగిన బ్రహ్మాండమయిన బహిరంగసభలో స్పష్టం చేశారు.

శ్రీ నారాయణ్ తన ప్రసంగంలో యిలా అన్నారు:

"శాసన సభను రద్దు చేయాలన్నకోర్కెను ఫాసిజాన్ని పెంపొందింప జేయడానికి ఉద్దేశించిన ప్రజాస్వామ్య వ్యతిరేకమయినకోర్కెగా అభివర్ణిస్తున్నారు. ప్రపంచ ప్రఖ్యాతరాజ్యాంగ నిపుణుడు లార్డ్ బ్రైస్ కూడా అక్రమ పాలన చేసే అవినీతికరమయిన మంత్రి వర్గాన్ని బర్తరఫ్ చేయవచ్చునని, నిర్ణయాన్ని ఓటర్లకు వదిలివేస్తూ తాజాగా ఎన్నికలు జరిపించవచ్చునని ...

రాష్ట్ర సోషలిస్టు పార్టీ అధ్యక్షులు శ్రీ రామానంద్ తివారీ, స్మగ్లర్ల లేక విదేశీ మారక ద్రవ్యం విషయంలో అక్రమ లావాదేవీలు జరుపుతున్న వారా అని నేను ప్రశ్నిస్తున్నాను. ఎవరు ఏయంత ? జయప్రకాశ్‌నారాయణా? లేక వారంతా ?"

"ప్రజాస్వామ్య పరిరక్షకులు నవంబర్ 11న (సి. పి. ఐ) నవంబర్ 16న (కాంగ్రెస్) యిదే మైదానంలో (గాంధి మైదానం)ఎంతో ఖర్చుపెట్టి సభలు జరిపారు. మైదానమంతటా గుడారాలు, షామియానాలు వేశారు. పూరేగింపులో పాల్గొనడానికి వచ్చిన కిరాయి మనుషులకు తిండి, ఆశ్రయం ఏర్పాటు చేశారు. ఈ డబ్బు అంతా వారికి ఎక్కడనుంచి వచ్చినట్లు ?

"సి. పి. ఐ., కాంగ్రెసు మద్దతుదారులను పాట్నా తీసుకొని రావడానికి పోలీసు సహాయంతో అన్ని సౌకర్యాలు చేశారు. కాగా నవంబర్ 4న ఛాత్రసంఘర్ష సమితి, జనసంఘర్ష సమితి ...

మిగతా 2 వ పేజీలో

[illegible]

## రాజధానిలో వైభవంగా ప్రధాని జన్మదిన వేడుకలు

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాదు, నవంబరు 19: [illegible]

### ప్రదేశ్ కాంగ్రెస్ కార్యాలయంలో సభ

[illegible]

### మహిళాదినోత్సవం

[illegible]



## ప్రధాని కోడలుకు భీమా ఏజన్సీ: జనసంఘ సభ్యుని వ్యాఖ్యపై రాజ్యసభలో వాగ్యుద్ధం

న్యూఢిల్లీ, నవంబరు 19: ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి కోడలు శ్రీమతి సోనియాగాంధికి భీమా ఏజెన్సీ గలదనీ, ప్రధాని కోడలుకు భీమా ఏజెన్సీ వుండటం నైతికంగా సమర్థనీయం కాదనీ నేడు రాజ్యసభలో జనసంఘ సభ్యుడు శ్రీ సుబ్రహ్మణ్యస్వామి అన్నప్పుడు, ప్రధాని కోడలును గురించి ఆయన అన్న మాటలను సభా రికార్డులనుండి తొలగించాలని కాంగ్రెసు సభ్యులు పట్టుబట్టారు. కాంగ్రెసు సభ్యుల కోర్కెను కమ్యూనిస్టేతర ప్రతిపక్ష సభ్యులు ప్రతిఘటించటంతో సభలో తీవ్ర వాదోపవాదాలు జరిగాయి.

ప్రశ్నోత్తరాల సమయంలో శ్రీ సుబ్రహ్మణ్యస్వామి ప్రసంగిస్తూ పై ఆరోపణ చేశారు. జీవితభీమా సంస్థ ఖర్చులపై సభ్యులు అనుబంధ ప్రశ్నలు వేస్తున్న సమయంలో శ్రీ సుబ్రహ్మణ్యస్వామి పై వ్యాఖ్యానం చేశారు.

అనుబంధ ప్రశ్నలకు ఆస్కారం లేదని కేంద్ర ఆర్థికమంత్రి శ్రీ సుబ్రహ్మణ్యం సభా అధ్యక్షుడు శ్రీ బి. డి. జెట్టికి వివరించబోగా మంత్రి మాటలు వినబడకుండా సభ్యులు అడ్డుపడ్డారు.

సభ కార్యక్రమ నిబంధనావళిలో 261 నిబంధన మేరకు సభ్యులు వేసే ప్రశ్నలకు ఏదో ఉద్దేశ్యాన్ని అంటగట్టటానికి వీలులేదని భారతీయ లోక్‌దళ్ సభ్యుడు శ్రీ రాదిరే అన్నారు.

ప్రధానమంత్రి కోడలుపై వ్యాఖ్యానాన్ని తొలగించాలా అక్కర లేదా అనే అంశం పై సభలో 15 నిముషాల సేపు గందరగోళం జరిగింది.

ఈ అంశం పై సభాధ్యక్షుడు రూలింగ్ యిచ్చేలోగా ప్రశ్నోత్తర సమయం ముగిసింది. ఆయన తరువాతి అంశాన్ని చర్చకు తీసుకున్నారు.

ప్రధాని కోడలుపై వచ్చిన ఆరోపణ కేంద్ర ఆర్థిక మంత్రి సమాధానంచెబుతూ శ్రీమతి సోనియా గాంధికి భీమా ఏజెన్సీ వున్నదో లేదో తను వద్ద సమాచారం లేదని అన్నారు.

శ్రీమతి సోనియా గాంధి మారుతీ కార్ల సంస్థనుండి భీమా ఫీజును వసూలు చేశారని తాము చేసిన ఆరోపణను మంత్రి ధృవీకరించటమో, తిరస్కరించటమో చేయాలని శ్రీ సుబ్రహ్మణ్యస్వామి పట్టుబట్టారు.

మంత్రి దగ్గర ఈ అంశం పై అవసరమైన సమాచారం లేకపోతే జనసంఘ సభ్యుడు తమ దగ్గర గల సమాచారాన్ని అందచేయటానికి అవకాశం యివ్వాలని శ్రీ రాదిరే కోరారు.

ప్రధాని కోడలుపై సభ్యుడు చేసిన వ్యాఖ్యానాన్ని రికార్డునుండి తొలగించాలని శ్రీ ఎ. జి. కులకర్ణి (కాం) కోరారు. మరో కాంగ్రెసు సభ్యుడు శ్రీ యూనస్‌సలీమ్ ప్రసంగిస్తూ, జనసంఘ సభ్యుడు చేసిన వ్యాఖ్యానం ... [illegible]

## ప్రధాని అభ్యుదయ విధానాల భగ్నానికి ప్రతీపశక్తుల యత్నం

— ముఖ్యమంత్రి హెచ్చరిక

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాదు, నవంబరు 19: [illegible]

### మారుతి సంస్థకు 2 కోట్ల డిపాజిట్లు

[illegible] 1973 1974 సంవత్సరానికి మారుతి సంస్థకు 2,18,91,042 రూపాయలు డిపాజిట్లు ... 1973—74 లో ఈ సంస్థ ... 48000 ... 3000 ... [illegible]

## సాగర్ ప్రాజెక్టుకు సహాయం: రాష్ట్రంనుంచి కొత్త ప్రతిపాదన అందలేదని కేంద్రం ప్రకటన

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

న్యూఢిల్లీ, నవంబర్ 19: నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మాణాన్ని పూర్తి చేయడానికి ... 15 కోట్ల రూపాయల ... 10 లక్షల టన్నుల ... [illegible]

## నవంబరు 29న సంపూర్ణ చంద్ర గ్రహణం

న్యూఢిల్లీ, నవంబరు 19: నవంబరు 29వ తేదీ రాత్రి సంపూర్ణ చంద్రగ్రహణం సంభవిస్తుంది. ... 6—59 ... 10—28 ... 11—31 ... [illegible]

## రైల్వే సిబ్బంది సమస్యలపై నేడే పార్లమెంటు వద్దధర్నా

న్యూఢిల్లీ, నవంబరు 19: [illegible] ... 36 ...

## ఆలయ భూముల కౌలు నిర్ణయానికి సంఘాలు

విశాఖపట్నం, నవంబరు 19: [illegible]

## శ్రీమతి గాంధి అచంచల ధైర్య సాహసాలు: రాష్ట్రపతి ప్రశంస

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాద్, నవంబరు 19: ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధి జన్మదినోత్సవ సందర్భంగా నేడిక్కడ రాష్ట్రప్రభుత్వ ఆధ్వర్యంలో జరిగిన ఒక సభలో రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్‌అలీఅహ్మద్ శ్రీమతి గాంధి తైలవర్ణ చిత్రాన్ని ఆవిష్కరించారు.

ప్రముఖ చిత్రకారుడు శ్రీ ఎస్. ఎస్. చామకూర్ ఈ చిత్రాన్ని గీశారు. ఆంధ్ర ప్రదేశ్ లలితకళా అకాడమీ ప్రశంసలనందుకున్న ప్రముఖ చిత్రకారులలో శ్రీ చామకూర్ ఒకరు. ఆయన అకాడమీ ఉపాధ్యక్షులుగానున్నారు. రాష్ట్రప్రభుత్వం కోర్కెపై మహాత్మగాంధి, ప్రకాశంపంతులు, జవహర్ లాల్‌నెహ్రూ, డాక్టర్ ఎస్. రాధాకృష్ణన్, శ్రీమతి గాంధి తైలవర్ణ చిత్రాలను ఆయన లోగడ పలుమారులు తయారు చేశారు.

శ్రీమతి గాంధి చిత్రాన్ని జూబిలీ హాలులో రాష్ట్రపతి ఆవిష్కరిస్తూ, భారతదేశం సర్వతోముఖాభివృద్ధి కోసం ప్రధానమంత్రి నిర్విరామంగా చేస్తున్న సేవలను శ్లాఘించారు.

బాల్యం నుంచే దేశ సేవలో మునిగిపోయిన శ్రీమతి గాంధి రాజకీయ జీవితాన్ని సింహావలోకనం చేస్తూ, దేశం ప్రస్తుతం ఎన్ని ఒడుదుడుకులను ఎదుర్కొంటున్నప్పటికీ, అచంచలమయిన ధైర్య స్థైర్యాలతో ఆమె దేశాన్ని ముందుకు నడుపుతున్న తీరు గణనీయమైనదని రాష్ట్రపతి అన్నారు. ఆమె ఇలాగే దీర్ఘకాలం దేశానికి సేవ చేయగలిగే శక్తిసామర్థ్యాలను భగవంతుడు ఆమెకు ప్రసాదించాలని ఆయన ప్రార్థించారు.

అంతకుముందు ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు రాష్ట్రపతికి స్వాగతం పలుకుతూ, శ్రీమతి గాంధి బహుముఖ సేవాపరాయణతకు జోహార్లు పలికారు. ఆర్థిక, సామాజిక చైతన్యం కోసం, దేశాభివృద్ధికి ఫలితాలు ప్రతి ఒక్కరు సమానంగా పంచుకోవాలనే లక్ష్యంతో,ముఖ్యంగా బలహీన వర్గాల అభ్యుదయం కోసం ఆమె జరుపుతున్న కృషిని ఆయన కొనియాడారు.

రాష్ట్రపతిసతీమణి శ్రీమతి అబిదాఅహ్మద్ కూడా వేదికను అలంకరించారు. రాష్ట్ర మంత్రులు, న్యాయమూర్తులు, ఉన్నతాధికారులు, శాసనసభ్యులు, పార్లమెంట్ సభ్యులు, యితర అనధికారులు పలువురు ఈ సభకు హాజరయ్యారు.

జాతియావత్తు నేడు ఆమెకు శుభాకాంక్షలు తెలుపుతున్నదని, ఆమె జన్మదినోత్సవం జరుపుకొనడానికి మనకి యింకాఎన్నో అవకాశాలు వస్తాయని శ్రీఫక్రుద్దీన్ అన్నారు.

ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు ప్రసంగిస్తూ ప్రపంచంలో ఈనాడు భారతీయ నాణెమట్లగల గౌరవం, శ్రద్ధ అంతర్జాతీయ రంగంలో శ్రీమతి గాంధి సాధించిన విజయానికి తార్కాణాలని పేర్కొన్నారు.

## విశాఖ ఉక్కు కర్మాగారం: తెన్నేటికి ప్రధాని హామీ

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

న్యూఢిల్లీ, నవంబర్ 19: [illegible] ... 14కోట్ల ... 14000 ...

### వినతిపత్రం వివరాలు

1971లో ... [illegible] ... నవంబర్ 15 న ... [illegible]

### విశాఖ ఉక్కు ఫ్యాక్టరీ: నిరసనవారం పాటింపు

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాదు, నవంబరు 19: [illegible]

## లారీ రవాణాలపై ఆంక్షలు: ఢిల్లీ పునః పరిశీలన

న్యూఢిల్లీ, నవంబరు 19: ... 500 కోట్ల ... 500కోట్లకు ... [illegible]

## గంటల పంచాంగం

శ్రీ ఆనందనామ సం. కార్తిక శు. షష్ఠి: 1974 వ సం. నవంబరు 20 బుధవారం బుధ: శు. షష్ఠి: ప. 12.23 శ్రవణం: రా. 3.05. శేష వర్జ్యం: ఉ. 6.27 వరకు.

1974 వ సం. నవంబరు 21 గురువారం గురు: శు. సప్తమి: ప. 2.54, ధనిష్ఠ: ఉ. 6.03, వర్జ్యం: ఉ. 7.36 మొదలు 9.23 వరకు.


శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 — 1972)

ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము తన మనంబునకగు దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమ ధర్మపథముల కెల్లన్
(మహాభారతము)

శ్రీ ఆనందనామ సం. కార్తిక శు. షష్ఠి:
బుధవారం


## హిందూ మహా సముద్రంలో శాంతి

హిందూమహాసముద్రం ప్రచ్ఛన్న యుద్ధానికి మరొక రంగం కాకూడదన్న కోరిక సరయినదే. భారతదేశం మొత్తం మీద తటస్థ విధానాన్నే అవలంబిస్తూ వస్తోంది కనుక ఈ కోరికని మరింత స్పష్టంగా వెలిబుచ్చటంలో ఆశ్చర్యం లేదు. హిందూమహా సముద్రంలో ఏమి జరిగినా దాని ప్రభావం భారతదేశం మీద కనిపించక మానదు. పాకిస్తాన్ వంటి దేశాలు ఈ ప్రాంతంలో కొంచెం అలజడి చెయ్యటానికి ప్రయత్నించవచ్చు కాని భారతదేశం దీనిని ప్రత్యేకంగా పట్టించుకోనక్కరలేదు. పాకిస్తాన్ పాలకుల ఆలోచనా విధానాలు మారేదాకా భారతదేశం సహనం కొంత చూపటం అవసరం. అసలు ఈ ప్రాంతంతో సంబంధంలేని "నాటో" రాజ్యాలు ఈ సముద్రంలో సైనిక విన్యాసాలు జరుపటం మాత్రం ఆశ్చర్యం కలిగించక మానదు. "సీటో, సెంటో"ల వంటి సైనిక ఒప్పందాలు ప్రస్తుతం ఎటువంటి పరిస్థితిలో ఉన్నాయో వేరే చెప్పనక్కరలేదు. ఎప్పటికప్పుడు మారిపోతున్న అంతర్జాతీయ రాజకీయాలు పాత ఒప్పందాల విషయంలో పెద్ద పరిణామాలు తీసుకురావచ్చు. యూరోపులో ఉండే పరిస్థితులు హిందూ మహాసముద్రం ప్రాంతంలో ఉండటానికి వీలులేదు. ఇక్కడ సైనిక స్థావరాలు నెలకొల్పటం వలన ఉద్రిక్త వాతావరణం ఏర్పడటానికి అవకాశాలు ఎక్కువ అవుతాయి. డీగోగార్సియా ద్వీపం భారతదేశానికి దక్షిణంగా, దగ్గరగానే ఉంది కనుక ఇక్కడి సైనిక స్థావరాన్ని గురించి భారతదేశం ఎక్కువగా ఆలోచించటంలో వింత ఏమీలేదు. అమెరికా సంయుక్త రాష్ట్రాలు కాని, మరే ఇతరదేశం కాని ఇక్కడ స్థావరాలు ఏర్పరచుకొనరాదని తటస్థ విధానాన్ని అవలంబించే వారు కోరితే ఉచితంగా ఉంటుంది. వ్యతిరేక ప్రచారం జరుపుతూనే మంతనాలు జరుపటం నేటి రాజకీయాలలో కనిపించేదే. హిందూమహా సముద్రం శాంతి ప్రాంతం కావాలని అనుకునే వారందరూ చిత్తశుద్ధితో కృషి చెయ్యకపోయినట్లయితే విదురు చూసిన ఫలితాలు రాకపోవచ్చు. ఇటీవల న్యూఢిల్లీలో జరిగిన సభలో పాలుగొన్న వారందరూ ఈ సత్యాన్ని గుర్తించాలి.

# గోదావరి రోడ్డు రైలు వంతెన ప్రాధాన్యం

గోదావరి మీద కొవ్వూరు—రాజమండ్రిలను కలుపుతూ రైలు—రోడ్డు వంతెన నిర్మాణం పూర్తి అయింది. భారత రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహమద్ దీనికి 20వ తేదీ బుధవారం ప్రారంభోత్సవం జరుపబోతున్నారు.

ఆసియాలోకల్లా అతి దీర్ఘమైన ఈ రైలు—రోడ్డు వంతెన పొడవు 9,594 అడుగులు. దీని నిర్మాణానికి రు. 10. 5కోట్లు ఖర్చయింది. పదేళ్లు పట్టింది. అటు రాజమండ్రి వైపున, ఇటు కొవ్వూరు వైపున, అప్రోచ్ రోడ్ల నిర్మాణానికి మరో రు. 2.22 కోట్లు ఖర్చయింది.

మదరాసు—కలకత్తా ట్రంకుమార్గంలో దక్షిణ మధ్య రైల్వేలో రైళ్ల రాకపోకలకు కల అంతరాయాలను తగ్గించేందుకు ఈ వంతెన ఎంతైన తోడ్పడగలదు. భారత రైలుమార్గాలలో ఈ మార్గం మీద రైళ్ల రాకపోకలు, సరకుల రవాణా అత్యధికం.

గోదావరి మీద రెండవ వంతెన నిర్మాణం 1964లో చేపట్టారు. దీనిమీద ఇంతకు ముందున్న వంతెన 1900లో నిర్మించారు. అప్పటి నుంచి ఇప్పటివరకు అది ఆందోళన కలిగిస్తూనే ఉంది. గోదావరి వరదలో ఉన్నప్పుడు దీనిమీద రైళ్ల వేగాన్ని, గంటకు 10 కిలోమీటర్లకు తగ్గించాల్సి వస్తూ ఉండేది. ఒక్కొక్కప్పుడు రైళ్ల రాకపోకలు రద్దు చేయడం కూడా జరుగుతుండేది. ఇది రైలు ప్రయాణాలకు, సరకుల రవాణాకు చాలా అంతరాయంగా ఉండేది. అయినందువల్లనే హౌరా మదరాసు మధ్య ఒళ్లను మార్గం మళ్లించి నడపాల్సి వచ్చేది. ఇందు వల్ల సుమారు 500 మైళ్ళ ప్రయాణం పొడిగించాల్సి వచ్చేది. ఈ రెండవ వంతెన నిర్మాణం ఆ ఇబ్బందిని పరిష్కరించగలదు.

ప్రారంభంలో దీనిని ఒక్క రైలువంతెనగానే నిర్మించాలనుకున్నారు. కాని ఆ ప్రాంత ప్రజలు పట్టుబట్టడంతో దానిని రైలు—రోడ్డు వంతెనగా రూపొందించాల్సివచ్చింది.

భారత రైల్వేల శాఖవారు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము కలిసి దీనిని నిర్మించారు. దీని నిర్మాణంలో ఎన్నో సమస్యలు ఎదురైనాయి. వాటి పరిష్కారానికి ఎన్నో నూతన ప్రక్రియలు సృష్టించి రికార్డు సృష్టించడం జరిగింది.

రెండంతస్తులుగా ఈ వంతెన నిర్మాణం జరిగింది. క్రింద రైలుమార్గం, పైన రోడ్డు మార్గం. రోడ్డు కిరుప్రక్కలా 5 అడుగుల వెడల్పున కాలిబాటలు కూడా ఉన్నాయి. నీటి మట్టానికి 75 అడుగుల ఎత్తున దీనిని నిర్మించారు.

5 వేల టన్నుల ఉక్కుతో 20 వేల ఘన మీటర్ల సిమెంటు కాంక్రీటు వేశారు. మొత్తం 26 వేల మెట్రిక్ టన్నుల సిమెంటు ఈ వంతెన నిర్మాణంలో ఖర్చయింది. 17,800 మెట్రిక్ టన్నుల ఉక్కు ఇందుకు ఖర్చయింది.

# రాష్ట్రంలో పరిశ్రమల అభివృద్ధి: పారిశ్రామికులకు మంత్రి ఉద్బోధ

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాదు, నవంబర్ 19: చక్కని రాజకీయ సుస్థిరత్వము, ప్రభుత్వం ఇచ్చే మంచి సౌకర్యాలు పారిశ్రామికులు బాగా వినియోగించుకుని, తాము బాగుపడి, రాష్ట్రం కూడా బాగు పడటానికి కృషి చెయ్యాలని పరిశ్రమలమంత్రి శ్రీ పెంచికల బసిరెడ్డి ఉద్బోధించారు.

పరిశ్రమలమంత్రి చిన్న పాయంత్రం సహాయ స్థాపక సంస్థ, పరిశ్రమల వాడలో పరిశ్రమలు పెట్టుకోడానికి ఇచ్చిన ఉత్తర్వులు అందజేశారు. సమావేశానికి శ్రీ వి. పి. రామారావు అధ్యక్షత వహించారు. రామచంద్రపురం భారత భారీ విద్యుత్ పరికరాలసంస్థలో పని చేసే 16 మందికి వారు పని చేస్తున్న సంస్థ పరిశ్రమల భారీ విద్యుత్ పరికరాల సంస్థ మేనేజింగ్ డైరెక్టరు శ్రీ ఎం. ఆర్ నాయుడు స్వాగతమిస్తూ, ఈ ఏడాది తమ సంస్థలో రు. 57 కోట్ల రూపాయల విలువగల పరికరాలు ఉత్పత్తి కాగలవన్నారు. తమ సంస్థలో పని చేసే వారికే సహాయ పరిశ్రమల స్థాపనకు వీలు కల్పించడమైందన్నారు. శ్రీ వి. పి. రామారావు ఈ పరిశ్రమలు పెట్టుకుని లాభాలు పొంది అందులోనే ఆ 16 మంది స్థిరపడిపోగలరనే ఆశను వెల్లడించారు.

దాదాపు పది కోట్ల రూపాయల వరకు పరిశ్రమలు స్థాపించే వారికి ప్రభుత్వం సహాయ పడుతోందని పరిశ్రమల మంత్రి అన్నారు. భూములకు సంపదకు గరిష్ఠ పరిమితి పెడుతున్న ఈ రోజులలో కలవారు పరిశ్రమలు స్థాపించడమే సరియైన సమార్గం కాగలదన్నారు. కడుపునిండా ఒక పూట తిండికి కూడా నోచుకోని వారున్న ఈ దేశంలో హంసతూలికా తల్పాలపై శాశ్వతంగా భోగా లనుభవించుదామనుకోవడం భ్రమ కాగలదని ఆత్మోద్ధరణకు తోడు, దేశోద్ధరణ కూడా దృష్టిలో ఉంచుకుని పరిశ్రమలు పెట్టుకోవాలన్నారు. శ్రీ బాలసుబ్రహ్మణ్యం అభినందనలు తెలిపారు.

తరువాత మంత్రి శ్రీ బసిరెడ్డి, శ్రీ రామారావు వెంట రాగా, పటాన్ చెర్వులో కడుతున్న పారిశ్రామిక వాడను చూచారు.

## జయప్రకాశ్ విమర్శ

(1 వ పేజీ తరువాయి)

జరిపిన ప్రదర్శనకు ప్రజలు రాకుండా శాయశక్తులా అధికారులు నిరోధించారు.

చాలా మందిని ముందుగానే అరెస్టుచేశారు. గంగానదిని ప్రజలు దాటకుండా చేయడానికి పోలీసులు పడవలను కూడా ముంచివేశారు. అయినా ప్రజలు చెక్కుచెదరనిధైర్యంతో నాటు తెప్పల మీద నదిని దాటి పాట్నా చేరుకున్నారు. "మీరు ఇంకా మాత్రం మాకు ప్రతినిధులు కారు, మంత్రులు, శాసన సభ్యులు రాజీనామా చేయాలి" అని మంత్రులకు శాసన సభ్యులకు చెప్పడానికి నవంబర్ 4న పాట్నా వచ్చిన వారిపై లాఠీఛార్జీలు జరిపారు. అరెస్టులు చేశారు. బాష్పవాయువును ప్రయోగించారు. కోర్కెలను వ్యక్తం చేసుకొనే హక్కు ప్రజలకు లేదా? మనం ఏ మాత్రం ప్రజాస్వామ్య వ్యవస్థలో జీవించడంలేదు. నియంతృత్వ వ్యవస్థలోనే మనం ఈ నాడు ఉన్నాము.

### ఎన్నికలు

"ఎన్నికలకు సంబంధించినంత వరకు కాంగ్రెస్ సేకరించే కోట్లాది రూపాయిల గురించిగాని, దొంగనోట్లను గురించి గాని నేను భయపడడంలేదు. నా అనుమానమల్లా ఒక్కటే. ఎన్నికల అధికారులను పోలింగ్ అధికారులను పాలకపక్షంవారు అవినీతి పద్ధతుల ద్వారా లొంగ దీసుకుంటారని నా అభిప్రాయం. అధికారులలో చాలామంది నైతికంగా దిగజారి పోయారు. వారు ప్రలోభాలకు గురికై లొంగిపోతారు.

"నాకు మితవాద అభివృద్ధి నిరోధక శక్తులు, దుండుడుకువాదులు మద్దతు ఇస్తున్నట్లు ప్రధానమంత్రి తరచుగా ఆరోపిస్తున్నారు. శ్రీమతి ఇందిరాగాంధీ ఒక్క విషయం మరచి పోతున్నారు. ఆమె అవకాశవాదులను తన చుట్టూ చేరదీస్తున్నారు. వారు ఎప్పుడో అప్పుడు ఆమెను గోతిలో దింపడం ఖాయం."

# చంపావతిపై రు. 15 లక్షలతో వంతెన: ప్రభుత్వం ఆలోచన

విజయనగరం, నవంబరు 19: ఇక్కడకు 24 కిలోమీటర్ల దూరంలో ఒల్లూరు దగ్గర చంపావతి నదిపై 15 లక్షల రూపాయల ఖర్చుతో వంతెన నిర్మించే ప్రతిపాదనను ప్రభుత్వం చురుకుగా పరిశీలిస్తోంది.

రహదారులు భవనాలశాఖ మంత్రి శ్రీ చనుమోలు వెంకటరావు నిన్న ఇక్కడ విలేఖరులతో మాట్లాడుతూ పై విషయాన్ని తెలియజేశారు.

వంతెన నిర్మాణ స్థలాన్ని ఆయన చూసి వచ్చారు. వంతెన నిర్మాణంవల్ల శ్రీకాకుళం జిల్లాలోని రణస్థలం వద్ద జాతీయరహదారులు కలిపి, ప్రయాణదూరం తగ్గుతుందని ఆయన అన్నారు.

పెద్ద వంతెనల దగ్గర వాహనాల నుంచి టోల్‌గేటు సుంకాన్ని వసూలు చేయాలను కుంటున్నామని, దానివల్ల 70 లక్షల రూపాయలు రాగలదని ఆయన అన్నారు.

రామతీర్థం దగ్గర మూడు లక్షల రూపాయల ఖర్చుతో మళ్లింపు రహదారిని నిర్మించాలని శాసనసభ్యులు శ్రీ అప్పన్నదొర, శ్రీ పి. సాంబశివరాజు మంత్రిని కోరారు.

ప్రతిపాదనలు పంపించవలసిందిగా సూపరింటెండింగ్ ఇంజనీర్‌ను మంత్రి కోరారు. పట్టణంలోని పెద్ద రహదారులను మంత్రి పరిశీలించారు. (స్వ. వి)

# ఆంధ్రప్రదేశ్ - రహదార్ల అభివృద్ధి

### చనుమోలు వెంకటరావు
రహదారులు, మరియు భవనములశాఖామంత్రి

మన రాష్ట్రంలో గత నాలుగు పంచవర్ష ప్రణాళికల్లో రహదార్ల అభివృద్ధికి ప్రజలకు ఇతోధిక ప్రయాణ సౌకర్యాలు కలుగచేయుటకు గణనీయమైన కృషి జరిగింది.

మన రాష్ట్రంలో 1957—58 లో వున్న 34,906 కి.మీ రోడ్లు 1972 మార్చి నాటికి 72,702 కి. మీ పెరిగినవి.

1972 నాటికి రాష్ట్రంలో 483 మైళ్ల సిమ్మెంటు రోడ్లు, 10,672 మైళ్ల తారు రోడ్లు, 2865 మైళ్ళ కంకర రోడ్లు, 627 మైళ్ళ సిమ్మెంటు మట్టి రోడ్లు మొత్తం 23,465 మైళ్ల పొడవు గల రోడ్లు, భవనాల శాఖ ఆధీనంలో వున్నాయి.

దేశం మొత్తం మీద తయారుచేసిన రోడ్ల బృహత్తర ప్రణాళిక క్రింద ఆంధ్రప్రదేశ్‌లో 1961 నుండి 1981 వరకు రహదార్లను విస్తృతంగా అభివృద్ధి చేయుటకు రు. 480 కోట్ల వ్యయంతో 20 సంవత్సరాల ప్రణాళిక తయారు చేయబడి అమలు జరుపబడుచున్నది. ఈ పథకం ప్రకారం రాష్ట్రములో సరాసరి రోడ్ల మైలేజి 100 చదరపు మైళ్లకు 52 మైళ్ళు పెంపటం, మారు మూలలో వున్న గ్రామాలకు రవాణా సౌకర్యాలు కలుగ జేయుటం ప్రధాన ఉద్దేశ్యం.

నాల్గవ ప్రణాళికలో రోడ్ల అభివృద్ధికి రు. 13 కోట్ల 21 లక్షలు కేటాయించబడింది. ఈ ప్రణాళికలో రు. 45 లక్షలతో నాగవళి నదిమీద సంకిలి వద్ద విజయనగరం— పాలకొండ రోడ్డు మీద ఒక బ్రిడ్జి, రు. 45 లక్షలతో సిద్ధ గౌతమి మీద అమలాపురం—పి.గన్నవరంలంక రోడ్డు మీద మరొక రోడ్డు, పెద్ద ఎడ్ల గాడి మీద రు.32 లక్షలతో ఏలూరు— కైకలూరు రోడ్డు మీద ఒక బ్రిడ్జి రు. 51 లక్షలతో రాజమండ్రి వద్ద గోదావరి నది మీద రైలు— రోడ్డు బ్రిడ్జి నిర్మాణాలు చేపట్టబడ్డాయి.

ఇవికాక మద్రాసు— బొంబాయి జాతీయ రహదారి మీద236/1 మైలు వద్ద రు. 15 లక్షలతో ఒక బ్రిడ్జి, కడప— కోడూరు— రేణిగుంటరోడ్డు అభివృద్ధికి రు. 15 లక్షలు ఆదోనివద్ద గుంటకల్— తుంగభద్ర రోడ్డు మీద రైల్వే ఓవర్ బ్రిడ్జికి రు. 26 లక్షలు చిత్తూరు కర్నూలు రోడ్డుకు రు. 15 లక్షలు, హైదరాబాదు— నాగార్జున సాగర రోడ్డు అభివృద్ధికి రు. 52 లక్షలు కరీంనగరు— లక్సెట్టిపేట రోడ్డు అభివృద్ధికి రు. 15 లక్షలు, సంగారెడ్డి— తుప్రాన్ రోడ్డు అభివృద్ధికి రు. 22 లక్షలు ఖర్చు పెట్టబడెను.

### ఐదవ ప్రణాళిక

ఐదవ రాష్ట్ర ప్రణాళికలో రహదార్ల అభివృద్ధికి రు. 17 కోట్లు కేటాయించబడెను. ఈ ప్రణాళికలో ముఖ్యంగా జిల్లా కేంద్రాలను రాష్ట్ర రాజధాని కలిపే రహదార్ల అభివృద్ధి ప్రాంతాంలో రహదార్ల అభివృద్ధి, నాగార్జునసాగర్ ఆయకట్టు ప్రాంతంలో రోడ్ల అభివృద్ధి బైపాసు రోడ్లు, బ్రిడ్జిల నిర్మాణం, నాల్గవ ప్రణాళికలో మిగిలి పోయిన రహదార్ల పనులు చేపట్టబడును.

మన రాష్ట్రంలో 1951 మైళ్ళ పొడవుగల జాతీయ రహదార్లు ఉన్నాయి. వీటి నిర్మాణానికి, మరమ్మతులకు కేంద్ర ప్రభుత్వం పూర్తి ఆర్థిక సహాయం చేస్తుంది. కాని నిర్వహణ, అధిపత్యం, రాష్ట్ర ప్రభుత్వం క్రింద ఉన్నది. నాల్గవ ప్రణాళికలో జాతీయ రహదార్ల అభివృద్ధి చేయుటకు రు. 65 కోట్లు కేటాయించబడెను.

911 మైళ్ళ రోడ్లను రెండింతలు వెడల్పు చేయుట, ముఖ్యమైన గుంటూరు, ఒంగోలు, నెల్లూరు, అనంతపురం, ప్రత్తిపాడు, అనకాపల్లి, తుని, శ్రీకాకుళం, విశాఖపట్నం, అనంతపూరు అగరపురలను పట్టణాలలో రద్దీ తగ్గించుటకు బైపాస్ రోడ్ల నిర్మాణం, గుంటూరు—విజయవాడ [illegible] 28 మైళ్ళ మార్గం నిర్మాణం చేపట్టబడెను.

ఈవిధులలో అమరావతిరోడ్డు 8/4 మైలు నుండి తాడికొండ మీదగా పంగలగిరి రోడ్డు రు 25 లక్షలు, ఏలూరు కైకలూరు రోడ్డు మీద పెద్దఎడ్ల గాడిపై ఒక వంతెన రు 32 లక్షలు మధిర ఎర్రుపాలెం రోడ్డు మీద కట్లేరు నదిపై వంతెన రు 16 లక్షలు, సూరేడు పల్లి—చింతూరు రోడ్డు అభివృద్ధి మొదలగు పనులు చేపట్టబడెను.

చెరకు ఆయకట్టు క్రింద చెరకు సెస్సు క్రింద ప్రభుత్వానికి వచ్చు రు. 50 లక్షలు నిధితో రహదారుల శాఖను సంస్కరించుటకు రు. 10 లక్షలు కేటాయించబడెను. ఆయకట్టు ప్రాంతంలో రు. 74 లక్షలు విలువ చేయు రోడ్ల పని ప్రారంభింపబడి చురుకుగా జరుగుచున్నది.

రైల్వే లెవల్ క్రాసింగ్సు దగ్గర రద్దీ తగ్గించుటకు, ప్రమాదాలను తొలగించుటకు రాష్ట్రంలో నాల్గవ ప్రణాళిక క్రింద అనకాపల్లి, సామర్లకోట కాకినాడ, తాడేపల్లిగూడెం, కొండపల్లి, ఒంగోలు, చిత్తూరు, కుప్పం, నెల్లూరు, హాసన్‌పర్తి, కాజీపేట, జనగామ్‌లలో రైల్వే క్రాసింగు వద్ద ఓవరు బ్రిడ్జిలు అండరు బ్రిడ్జిల పనులు చేపట్టబడెను. ఇంత వరకు రు. 77 లక్షలు ఖర్చు పెట్టబడెను. ఇంకా ఐదవ ప్రణాళికలో రు. 126 లక్షలు ఖర్చు పెట్టి పై పనులు పూర్తి చేయబడెను.

## బాలకాండము
యామిజాల పద్మనాభస్వామి

### 6 వ సర్గ

యథా మను ర్మహాతేజా
లోకస్య పరిరక్షితా
తథా దశరథో రాజా
వసన్ జగ దపాలయత్ ... 4

తేన సత్యాభి సంధేన
త్రివర్గ మనుతిష్ఠతా
పాలితా సా పురీ శ్రేష్ఠా
ఇంద్రే ణే వా మరావతీ ... 5

మొట్టమొదటివాడైన వైవస్వతమనువు లాగ మహాతేజస్కుడైన దశరథ మహారాజు అయోధ్యలో నివసిస్తూ లోకాన్ని కంటిరెప్పలాగా కాపాడుతూ పాలిస్తూ ఉండేవాడు. ఇంద్రుని దొరతనములో అమరావతి లాగ సత్యప్రతిజ్ఞుడైన దశరథుని పరిపాలనలో ధర్మార్థకామాలు పక్రమంపుష్టి పొందుతూ ఉండేవి.

(4— వ శ్లోకములో లోకస్య పరిరక్షితా'— అనేది మరల నిచ్చిన పాఠం ఒకటి ఉన్నది. దానికి అర్థం సరిగా రాదు. పైగా క్రియాపదం లేకుండా పోతుంది. కనుక 'వసన్ జగదపాలయత్'— అనే పాఠం సముచితంగా ఉంటుందని దానినే తీసుకున్నాను.

5 వ శ్లోకములో ఇంద్రేణే'— అనే తృతీయాంతానికి ఉన్న అన్వయపుష్టి, ఉపమాబలం ఇంద్రస్య' అనే షష్ఠ్యంతానికి రాదని షష్ఠ్యంతపాఠం విడిచిపెట్టాను. ఇంద్రునకు లేక ఇంద్రునియొక్క అమరావతి వలె—అనడం కంటె, ఇంద్రుని చేత పాలింపబడిన అమరావతి వలె దశరథుని చేత అయోధ్య పాలింపబడినది— అనే దానిలో ఉన్న అన్వయబలపుష్టిని పాఠకులు గ్రహించగలరు.

అమరావతితో అయోధ్యను, ఇంద్రునితో దశరథుని ఉపమించడం వల్ల అయోధ్యకు సాటియైన పట్టణం ఇంకొకటి లేదనీ, దశరథుని వంటి రాజు మరొకడు లేడనీ ధ్వని.

(విష్ణువు అవతరించడానికి తగినపట్టణం అయోధ్య అనీ, విష్ణువునకు తండ్రి కాదగిన అర్హత కలవాడు దశరథుడనీ వ్యంగ్యం.)

[సశేషం]

## విమాన సర్వీసుల పునరుద్ధరణపై భారత్ పాక్ చర్చలు

రావల్పిండి, నవంబరు 19: భారత్, పాకిస్తాన్‌ల మధ్య విమాన సర్వీసుల పునరుద్ధరణపై [illegible] ప్రారంభమైనవి.

అంతర్జాతీయ పౌరవిమానసంస్థ ముందున్న కేసును ఉపసంహరించుకోవాలని ఉభయపక్షాలు భావిస్తున్నాయి.

నిన్న రెండుసార్లు చర్చలు జరిగాయి. చర్చల వివరాలు అధికారపూర్వకంగా వెల్లడి కాలేదు.

సిమ్లా ఒప్పందం ప్రకారం ద్వైపాక్షిక చర్చలద్వారా అన్ని విషయాలను పరిష్కరించుకొనడానికి పాకిస్తాన్ అంగీకరించినట్లు తెలుస్తున్నది.

సంభాషణలు ఎంతో స్నేహపూర్వకంగా ప్రారంభమైనవని పాక్ ప్రతినిధివర్గ నాయకుడు ఫాజల్ ముకీమ్‌ఖాన్ మొదటిదఫా చర్చల అనంతరం పత్రికల వారితో మాట్లాడుతూ చెప్పారు.

నష్టపరిహారాల చెల్లింపు సమస్యపై చర్చలలో ప్రతిష్టంభన ఏర్పడవచ్చునని 'పాకిస్తాన్ టైమ్స్' పత్రిక నిన్న సూచనగా తెలిపింది. కాని సంభాషణలలో అలాంటి వాతావరణం కనిపించలేదు.

పాక్ ప్రతినిధివర్గం నాయకుడు ముకీమ్ ఖాన్ అంతర్జాతీయ పౌర విమానయాన సంస్థ (ఐ.సి.ఎ.ఓ) ముందున్న కేసు గురించి, విమాన సర్వీసులగురించి ప్రారంభంలో ప్రస్తావించారు. భారత ప్రతినిధివర్గ నాయకుడు శ్రీ సహగల్ సిమ్లా ఒప్పందం ప్రాతిపదికపై అన్ని సమస్యలను ద్వైపాక్షిక చర్చలద్వారా పరిష్కరించుకోవాలని భారత్ ఆసక్తితో కందని చెప్పారు.

ఐ. సి. ఎ. ఓ. ముందున్న 1971నాటి కేసును పరస్పరం సంప్రదించుకొని పరిష్కరించుకొనడంపట్ల భారత్ ఆసక్తితో వున్నదని కూడా ఆయన తెలిపారు.

## దినఫలం

20-11-1974 బుధవారం
శక సం. 1896 కార్తికమాసం 29

★ మేషం:— స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు.

★ వృషభం:— వృత్తిలో మీ ఆలోచనలు ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు బాగుంటాయి.

★ మిథునం:— మీరు వెనుకకు తగ్గడమే మంచిది కాగలదు. ఉద్యోగంలో ప్రయాస కలుగుతుంది.

★ కర్కాటకం:— రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. బంధుమిత్రులను కలుసుకుంటారు.

★ సింహం:— పోటీవారితో మాటపట్టింపులు తగవు. ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది.

★ కన్య:— విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయాణాలలో అనుకూలంగా ఉంటాయి.

★ తుల:— ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. బంధువులకు సహాయం చేస్తారు.

★ వృశ్చికం:— మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

★ ధనుస్సు:— ప్రయోజనం గల సరిచయాలు ఏర్పడతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

★ మకరం:— నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ఉద్యోగంలో గౌరవప్రాబల్యాలు బాగుంటాయి.

★ కుంభం:— మీ తాలూకు వస్తువులు పోవచ్చును. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు.

★ మీనం:— వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణాలు ఫలించగలవు.

— మహేష్

## చిత్ర విచిత్రం

శ్రీనివాస్.

# విలన్ వేషధారి దేవదాస్!

దర్శక శ్రేష్ఠుడు కాశీనాథుని విశ్వనాథ్ చేసే పనులలో ప్రత్యేకత, విశిష్టత కనిపిస్తుంది. తనకు నమ్మకం ఏర్పడితే చాలు ఎట్టి గట్టి విషయాన్నయినా సునాయాసంగా చేసుకోగలరు.

"ఓ సీత కథ" చిత్రంలో ముఖ్యపాత్రను కొత్త నటుడు దేవదాస్ కనకాల కిచ్చారు. విశ్వనాథ్ శిక్షణలో అతడు అద్భుతంగా నటించాడు. అతడి నటనలో నాచురాలిటీ, ఈజ్ అగుపించాయి. తియ్యటిమాటలతో గొంతు కొట్టించగల మనిషిగా దేవదాస్ చక్కగా నటించాడు. ఈ దేవదాసు మద్రాసు ఫిలిం యాక్టింగ్ స్కూలులో ఉపన్యాసకుడుగా పని చేస్తున్నారు.

"సీతకథ" చిత్రంలో అందరిచేతా సెహభాష్ అనిపించుకున్న దేవదాస్‌కి తక్కువ చిత్రాలలో నటించి, ఎక్కువ కాలం పేరు ప్రతిష్ఠలతో ఉండాలన్న తలంపు వున్నట్లు తెలుస్తోంది.

## సంక్షిప్త వార్తలు

### గుంటూరు

రోటరీ ఇంటర్నేషనల్ డిస్ట్రిక్టు (315) ఆధ్వర్యాన రోటరీ—ప్రజా సంబంధాలు అనే విషయంపై గోష్ఠి కార్యక్రమము జరిగింది. మాజీ డిస్ట్రిక్టు గవర్నర్ మద్ది సుదర్శనం స్వాగతం చెప్పారు. గుంటూరు రోటరీ అధ్యక్షులు శ్రీ డి. ఆర్. సి. విజయ ప్రముఖులను పరిచయం చేశారు. శ్రీ పి. నరసింహారావు గోష్ఠి ఉపక్రమిస్తూ ఏ కార్యక్రమము చేస్తూన్నా ప్రచారము అవసరమని అన్నారు. ముఖ్య అతిథిగా పాల్గొన్న రాష్ట్ర ఆరోగ్యమంత్రి శ్రీ రాజమల్లు రోటరీ వంటి సేవా సంస్థలు ఆర్థిక అసమానతలు తొలగించుటలో, బీదవారిని ఆదుకొనుటలో ముఖ్య పాత్ర వహించాలని విజ్ఞప్తి చేశారు. రోటరీ మాజీ గవర్నర్ 315 జిల్లాలోని వివిధ ప్రజా సేవా కార్యక్రమాలను వివరించారు.

### కొణకంచి

కొణకంచి వెంకటేశ్వరరావుచే రచింపబడిన 'కొణకంచి చరిత్ర' గ్రంథాన్ని శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (అధికార భాషా సమితి అధ్యక్షులు) ఆవిష్కరించారు. శ్రీ కాకుమాను రామకోటేశ్వరరావు ఆవిష్కరణ కర్త ముఖ్య అతిథులను పరిచయం చేశారు. పంచాయితీ రాజ్యం, విశ్వర్షి సంపాదకుడు శ్రీ చిర్రావూరి నాగభూషణాచార్యులు గ్రంథ కర్తను, గ్రంథములోని విషయములను పరిచయం చేశారు. శాసన సభ్యురాలు శ్రీమతి వాసిరెడ్డి రాజ్యలక్ష్మమ్మ, కృష్ణాజిల్లా కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ బుచ్చిరామశ్రేష్ఠి, నందిగామ సమితి అధ్యక్షులు శ్రీ మున్నంగి వెంకటేశ్వరరావు, జగ్గయ్యపేట భూమితనఖా బ్యాంకు అధ్యక్షులు శ్రీ వాసిరెడ్డి మంజుశ్రీ సోమ్యాలగూడెం సర్పంచ్ పోలా విశ్వనాథం కొవ్వూరు వెంకటేశ్వర్లు, సెంటెల్ హనుమయ్య ఉపన్యసించారు. గ్రంథకారు సాతులూరి రాఘవయ్య వందన సమర్పణ చేశారు.

### సిద్దిపేట

శ్రీ ఎం. రంగకృష్ణమాచార్యులు రచించిన శ్రీ వెంకటేశ్వర నక్షత్రమాల కావ్యాన్ని శ్రీ [illegible] ప్రచురించారు.

కావ్యావిష్కరణ సభకు శ్రీ కె. వి. రాఘవాచార్యులు అధ్యక్షత వహించారు. శ్రీ పరాశరం గోపాలకృష్ణమూర్తి కావ్యావిష్కరణ చేశారు. శ్రీ జి. గట్టయ్య స్వాగతం పలికారు. శ్రీ వేములపల్లి నరసింహాచార్యులకు కావ్యాన్ని అంకితం చేశారు.

శ్రీ బాలసుబయ్య వందన సమర్పణ చేశారు.

### అమలాపురం

సబ్‌రిజిష్ట్రారు కార్యాలయంవద్ద కోర్టు ఫీజు, రిజిష్ట్రేషన్‌స్టాంపులు అమ్మకానికి అమలాపురం మున్సిపల్‌చైర్మన్ శ్రీ ఎస్. పి. బుడాన్‌సాహెబ్ ప్రారంభోత్సవం చేశారు. ఈ ప్రయోగాత్మక పథకం విజయవంతం కావడానికి ప్రజలు సహకరించాలని కోరారు. సబ్‌రిజిష్ట్రార్ శ్రీ వి. ఎల్. ప్రభాకరరావు స్వాగతం పలికారు. శ్రీ జయంతి సత్యనారాయణ, శ్రీ సి.ఎస్. రామారావు ప్రసంగించారు. శ్రీ ఎస్.నాగాచారావు వందన సమర్పణ చేశారు.

### కొత్తపేట

ఉన్నతపాఠశాల పాతవిద్యార్థులు, ఉపాధ్యాయులు, ఇటీవలనే పదవీ విరమణ చేసిన శ్రీ ఎం. వి. ఎస్. సుబ్బరాజు అభినందనసభ జరిపారు. ఈ సందర్భంలో నెల్లూరులో [illegible] అర్హత మండలి శ్రీ [illegible] ఆవిష్కరించారు. తూర్పు గోదావరి జిల్లా పరిషత్ అధ్యక్షుడు శ్రీ ఎస్.బి.పి.బి.కె. సత్యనారాయణరావు సభకు అధ్యక్షత వహించారు. శ్రీ ముద్దాల సుబ్బారాయుడు, శ్రీ [illegible] సత్యనారాయణ, శ్రీ కందుకూరి సూర్యనారాయణ, శ్రీ [illegible] శ్రీరామమూర్తి సుబ్బరాజుకు స్వాగత పత్రాలు సమర్పించారు. శ్రీ సుబ్బరాజు తనకు జరిపిన సన్మానానికి కృతజ్ఞతలు తెలిపారు. శ్రీ జి. ఎస్. శాస్త్రి పండితులు చదివారు. శ్రీ సోమ సూర్యనారాయణ వందన సమర్పణ చేశారు.

## లేఖలు

### నిరుద్యోగ సమస్య పరిష్కారం

అయ్యా! కేంద్రములో ఈ మధ్య మంత్రుల సంఖ్య పెంచారు. రాష్ట్రంలో కూడా మంత్రుల సంఖ్య పెరుగుతోంది. పరిపాలనా సౌలభ్యానికి కాక పార్లమెంట్ సభ్యులలోనూ, శాసనసభ్యులలోనూ 'నిరుద్యోగ సమస్య' నివారించడానికే ఈ 'పద్ధతి' తీసుకుంటున్నారనుకోవాలి. ప్రాంతీయ, కుల ప్రాతిపదికలమీద మంత్రివర్గంలో స్థానం కలిగిస్తూ పెద్దరికం స్వవన్నని మంటగలుపుతున్నారు. అధికార పార్టీలోని 'ప్రతిపక్షానికి' తగిన 'వాటా' ఇచ్చి 'ప్రమాదాన్ని' నివారించుకొంటున్నారు.

మంత్రుల సంఖ్యని రోజు రోజుకి పెంచుతోన్న ప్రధానమంత్రి, రాష్ట్ర ముఖ్యమంత్రులు దేశంలో నానాటికి పెరిగిపోతున్న నిరుద్యోగ సమస్యని పరిష్కరించడానికి పథకాలు వేయడం మంచిది. పారిశ్రామిక సంస్థలు మూతపడి అనేక మంది ఉపాధి కోల్పోయే స్థితి ఏర్పడకుండా తక్షణ చర్యలు తీసుకోవడం ప్రభుత్వ బాధ్యత. 'పరిమితమైన కుటుంబం' ఉండాలని వినాదాలు చేసే ప్రభుత్వం మంత్రివర్గంలోని సభ్యుల సంఖ్య పరిమితం చేసుకోవడం ఉత్తమం.

రాజేంద్రప్రసాద్, 3, కె.ఆర్. కొయిల్ సి., నెక్స్ నుంగంబాకం, మదరాసు—34.

### అలనాడు...

అయ్యా! 2.11.1974 ఆంధ్రపత్రిక సంపాదకీయంలో ఇనుమడిస్తూ రోసించిన బ్యాంకు గురించి, సర్దార్ పటేల్ కృషి కొనసాగించటాన్ని ప్రధానమంత్రి చెప్పిన మాటలు చదివిన తరువాత కొన్ని ప్రశ్నలు ఉదయించక తప్పదు.

నేటి అనైక్యతకు కారణం అలనాడు ప్రధానమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి విషయంలో చూపిన అనవసర వైర్య సాహసాలు కావా?

అతనితో, స్వార్థంతో సలుపుతున్నయ్యి ప్రజలకు అనుసరణీయ బోధించటం నైతికంగా బలం ఇస్తుందా?

ఆర్.కె.అంబాపెరమ్, ఇండస్ట్రియల్ ఎస్టేట్, కడప.

### విజయవాడలో ట్రాఫిక్ నిబంధనలు

అయ్యా! విజయవాడలో సెప్టెంబరు 8వ తేదీ నుండి కొత్త ట్రాఫిక్ నిబంధనలు అమలు చేయుచున్నారు గాని ఇంతవరకు ఏ రోడ్డుకూ ట్రాఫిక్ సైన్ బోర్డులు మాత్రం ఏర్పాటుచేయలేదు. అందువల్ల కొందరు శిక్షార్హులగుచున్నారు.

ఉదాహరణకి, విజయవాడ పైపుల నుండి విజయవాడ బస్సులు దాటి బందరు రోడ్డును నడచుటకు అనుమతి ఉన్నప్పటికీ బెంజి కంపెనీ వద్ద 'లారీలకు ప్రవేశము లేదు' అనే సైనుబోర్డు మాత్రం అలాగే ఉండిపోయినది. ఆ సైను బోర్డు ఏయింది దానికి తగిన ప్రదేశంలో ఏర్పాటు చేయుట సముచితముగా ఉండును.

జె. రాఘవేంద్రరావు, దుర్గ ఓసెల్ హౌవుస్, గోపాలరెడ్డి రోడ్, విజయవాడ.

### మునియేరు ఆనకట్ట కాల్వల చివర ఆయకట్టు

అయ్యా! నందిగామ తాలూకాలో గల మునియేరు ఆనకట్ట కాలువల చివరగల మాగాణి భూముల పరిస్థితి గత నాలుగు సంవత్సరాలనుండి చాల దారుణముగా నున్నది. సకాలములో వర్షములు లేక పంటల దిగుబడులు పూర్తిగా తగ్గిపోయినవి. అసలు ఈ ప్రాజెక్టు కేవలము వర్షాధారము. తీవ్రమైన అనావృష్టికి ఆకుమళ్లు కూడ ఎండిపోయినవి. ఎవరకు వర్షాలు ప్రారంభమైనందున సెప్టెంబరులో నాట్లు చాలా తక్కువ పొలములో మాత్రమే జరిగినవి. అంటే తెగుళ్లకు గురియై పంట దిగుబడి ఖర్చులకు గూడ చాలకుండా ఉన్నది. వేసిన మాగాణి భూములు ఈ విధంగా ఉండగా, మిగిలిన వేలాది ఎకరాలమాగాణి భూములు అతివృష్టికి గురియై అటు మాగాణికి ఇటు మెట్ట సాగుకు కూడ పనికిరాకుండా నిరుపయోగంగా ఉన్నవి. కాలువల చివర భూములు గల కొండూరు, మాగల్లు, సోమవరం, రుద్రవరం, పల్లగిరి మన్నైరా గ్రామాల ఆయకట్టు రైతుల పరిస్థితి దయనీయంగా ఉన్నది. ఇట్టి దీనావస్థలో నున్న రైతాంగముపై ఈ సంవత్సరం ప్రభుత్వంవారు ధాన్యం లెవీ నోటీసులు అందజేయుచున్నారు. ఇది చాల అన్యాయం. ప్రభుత్వంవారు వెంటనే ధాన్యం లెవీ ఉత్తర్వులను ఉపసంహరించుకొనవలసినదిగా కోరుచున్నాను.

చెరుకుపల్లి వెంకటయ్య, సర్పంచ్, గ్రామపంచాయితి, మాగల్లు.

### డిప్లొమా కోర్సులు

అయ్యా! శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంవారు ఈ ఏడు అనంతపురం పి.జి. సెంటరు, తిరుపతి విశ్వవిద్యాలయంలోను డిప్లొమా కోర్సులు మొదలుపెడతామని ప్రకటించారు.

వీటికి సంబంధించిన వివరాలు ఇంకా వెలువడలేదు. ఎందరో తెలుగు పట్టభద్రులు దీనికోసం కాచుకుని కూర్చుని ఉన్నారు. విశ్వవిద్యాలయంవారు సమాచారాన్ని ప్రకటించాలని కోరుతున్నాను.

జె.ఎస్. వెంకటేశ్వర్లు, 3—100, రంగాజీవీధి, అనంతపురం.

### మద్యపాన నిషేధం

అయ్యా! తమిళనాడు ప్రభుత్వం కాంగ్రెసేతర ప్రభుత్వం. వారు మద్యపాన నిషేధాన్ని అమలుపరుచగా గాంధీగారి సూత్రాలని వల్లించే కాంగ్రెసువారు ఆంధ్రప్రదేశ్‌లో మద్యపాన నిషేధాన్ని తొలగించటం బాగాలేదు. మద్యపాన నిషేధాన్ని అమలుపరచటానికి ఉద్యమాలు మొదలు కావాలి. దానికి అన్ని వర్గాలవారి సహకారమూ అవసరం.

పి. నరసింహం, సర్వోదయ కార్యకర్త, విశ్వహిందూపరిషత్తు సభ్యుడు, జమ్మలమడుగు.

### వర్షం-కుట్ర

అయ్యా, 8.11.74 తేదీ పత్రికలో పాలకొల్లు పాఠకుడు సత్యనారాయణమూర్తి గారు వ్రాసిన లేఖలో వారు వ్రాసినట్లు కొంతమంది సదరులో ఉన్నారు. దేశంలో ఏది జరిగినా, దానికి వెనుక అదావిక శక్తులు, విదేశ శక్తులు కారణం అయినట్లు మాట్లాడటం అలవాటు అయిపోయింది. ఇది ఎంతగా అలవాటు అయిపోయిందంటే మబ్బులుపట్టకుండా విజయవాడలో 'హఠాత్తుగా వర్షం కురిస్తే' దానికి అమెరికా కుట్ర అయినట్లు 'మేఘరు స్టేటుమెంటు' ఇవ్వటం వరకు వచ్చిందంటే అతిశయోక్తి కాదేమో? వీరిలో ఉన్నారు ఒక విషయం గుర్తిస్తే బాగుంటుంది. వారు సభలో ఉన్నారు కాబట్టి పార్టీలు మార్చుకొనవచ్చు, ఆత్మలు అమ్ముకోవచ్చు. కాని భారతదేశంలోని సదస్సులో లేని ప్రజలు విదేశీయులకు ఆత్మలు అమ్ముకొనేంత నీచస్థితికి దిగజారలేదు. ప్రజలు అంతగా సహనం చూపి లోపల ప్రజా ఉద్యమాలు ఈ దేశములో తేలేరాలని కావాలి. ఆపైన ఇటువంటి ప్రకటనలు చేసే ముందు వారిని ఎన్నుకున్నది అమాయకులైన ఆ ప్రజలే అని గుర్తిస్తే బాగుంటుంది. విదేశముతో సంబంధం మన్నాను. జై హింద్.

ఎల్. నర్సింహ్మరావు, నాగేశ్వరరావు పంతులురోడ్, గాంధీనగర్, విజయవాడ.

## మా ఊరి సమస్య

### జంగంగుంట్ల సమస్య
(10రూ.లుబహుమతిపొందినలేఖ)

జంగంగుంట్ల జనాభా 4500. అందులో 2000 మంది ఆడవారు. వీరికి మరుగు దొడ్డి లేక ఇబ్బందులు పడుతున్నారు.

పి. సి. హెచ్. వీరారెడ్డి, బి.కాం. రెండవ సంవత్సరం, జంగంగుంట్ల పోస్టు, గిద్దలూరు తాలూకా, ప్రకాశంజిల్లా.

### ఆరికరేవుల గ్రంథాలయం

మా వూరి గ్రంథాలయంలో పుస్తకాలు ఇవ్వబడటంలేదు.

కొర్ల దొరయ్య, ఆరికరేవుల, రామచంద్రపురం తాలూకా, తూ. గో. జి.

### జంగాలపల్లి వీధులు

కరెంటు స్తంభాలు వేశారుకానివాటికి దీపాలులేవు. హరిజనవాడకి రెండాలేవు. ఇది మా వూరి సమస్య.

పి. నరసింహారావు, జంగాలపల్లి, విజయవాడ తాలూకా, కృ. జి.

# ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమిషన్

## ప్రకటన నెం. *14 (1973-74)*

డెహ్రాడూన్‌లోని, రాష్ట్రీయ ఇండియన్ మిలిటరీ కళాశాల (మాజీ సైనిక స్కూల్)లో ప్రవేశము కొరకు ఆంధ్రప్రదేశ్, హైదరాబాద్ లో 1975 ఫిబ్రవరి 20 మరియు 21 తేదీలలో ప్రవేశ పరీక్షలు నిర్వహించబడును.

డెహ్రాడూన్‌లోని రాష్ట్రీయ ఇండియన్ మిలిటరీ కళాశాలలో బాలుర ప్రవేశము కొరకు తదుపరి ప్రవేశ పరీక్షలు సెక్రెటరీ, ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమిషన్, హైదరాబాద్ వారిచే, హైదరాబాద్‌నందు 1975 ఫిబ్రవరి 20 మరియు 21వ తేదీలలో నిర్వహించబడునని ఇందుమూలముగా తెలియపరచడమైనది. ఈ పరీక్షలు వ్రాతపూర్వకంగాను, మౌఖికంగానూ ఉండగలవు.

ఆంధ్రప్రదేశ్‌లో సాధారణంగా నివసిస్తున్నటువంటి తల్లిదండ్రులు లేదా సంరక్షకుల నుండి అభ్యర్థుల తరఫున దరఖాస్తులు (డూప్లికేట్‌లో) నిర్ణీత ఫారములలో సెక్రెటరీ, ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమిషన్, గృహకల్ప వెనుక, హైదరాబాద్—500001 వారికి 15 జనవరి 1975 తేదీకి మించకుండా అందవలెను. దరఖాస్తులతోపాటు అవసరమగు సర్టిఫికెట్లను జతపరచవలెను. రాష్ట్రీయ ఇండియన్ మిలిటరీ కళాశాలలో ప్రవేశము కోరుతున్న అభ్యర్థుల వయసు 1 జులై 1975 నాటికి 11 మరియు 12 మధ్య ఉండవలెను. వయోపరిమితి సడలింపులు అనుమతించబడవు. షెడ్యూలు కులములు, షెడ్యూలు తెగలకు చెందిన అభ్యర్థులకు రాష్ట్రీయ ఇండియన్ మిలిటరీ కళాశాలలో రుసుముసొలుకు రు. 1500లకు బదులు రు. 750లు వసూలు చేయబడును.

శిక్షణ కోర్సును గురించిన వివరములను, నమూనా ప్రశ్నాపత్రములు పత్రాలను ఎందు నిమిత్తము దరఖాస్తు కావలసినదీ తెలియపర్చుతూ వ్రాసిన అభ్యర్థునకు, స్వంత చిరునామా గలిగి (25 × 10 సెం.మీ. సైజు) 20 పైసలు స్టాంపులు అంటించిన కవరును జతపర్చి పంపి సెక్రెటరీ, ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమిషన్, గృహకల్ప వెనుక, హైదరాబాద్—500001 వారి నుండి పొందవచ్చును. కవరుమీద పరీక్ష పేరు, ప్రకటన నెంబరు, తేది వ్రాయవలెను. తగినన్ని స్టాంపులు అంటించి స్వంత చిరునామా గల కవరు జతపరచని అభ్యర్థనలు పరిశీలించబడవు.

# ది అనకాపల్లి కో ఆపరేటివ్ అగ్రికల్చరల్ అండ్ ఇండస్ట్రియల్ సొసైటి లిమిటెడ్

**తుమ్మపాల పోస్టు, అనకాపల్లి ఆర్. ఎస్, విశాఖపట్నం జిల్లా (ఎ.పి)**

## టెండరు నోటీసు

1974—75 సంవత్సరములో చెరకు క్రషింగ్ సీజనులో విశాఖపట్నం జిల్లా యందు ఫ్యాక్టరీ జోనులో సొంతలారీ యజమానులు లేక వారిచే అనుమతించబడిన ఏజంట్లు మరియు ట్రాన్స్‌పోర్టు కంట్రాక్టర్ల నుండి ఈదిగువ పేర్కొనబడిన స్థలములనుండి ఫ్యాక్టరీ కేన్‌క్యారియర్ వద్దకు చెరకు రవాణా చేయుటకు సీలువేసిన టెండర్లు 29—11—74 తేది సాయంత్రము 3—00 గంటల వరకు కోరబడుచున్నవి. ప్రతియొక్క టెండరుతోపాటు టెండరు డిపాజిట్లు రు 2000/— స్టేటుబ్యాంక్ఆఫ్ ఇండియా, అనకాపల్లి బ్రాంచియందు మాత్రమే అనకాపల్లి కో ఆపరేటివ్ అగ్రికల్చరు ఇండస్ట్రియల్ సొసైటీ లిమిటెడ్ ఖాతాకు డ్రాఫ్టు చెల్లించి సదరు డ్రాఫ్టును దరఖాస్తుతోపాటు సొంతలారీ బండియొక్క "V" సర్టిఫికేటుతో పంపవలయును.

సదరు టెండర్లు 29—11—1974 తేది సాయంత్రం 3—00 గంటల వరకు స్వీకరించబడును.

| వరుస | ఐటం | ఒకదినమునకు సాధారణంగా రాగల చెరకుపరిమాణము | ఒక దినమునకు కావలసిన లారీలు సంఖ్య |
|---|---|---|---|
| 1. | నరసింగబిల్లి సెంటర్ వే బ్రిడ్జి నుండి రమారమిగా 30,000 మె. టన్నులు చెరకు రవాణాచేయుట. | మె. టు 200 నుండి 300 | 6 నుండి 8 |
| 2. | తిమ్మరాజుపేట సెంటర్ వే బ్రిడ్జి నుండి రమారమిగా 20,000 మె. టన్నుల చెరకు రవాణాచేయుట. | 100 నుండి 150 | 4 నుండి 6 |

టెండరు షెడ్యూళ్ళు కావలసినవారు పై కార్యాలయమునందు రు 5/— రుసుము చెల్లించి పొందవచ్చును. తేది 29—11—74 మధ్యాహ్నము 2—00 గంటల లోపుగా తుమ్మపాల సొసైటీ కార్యాలయమందు రు 5/— రొక్కముగా చెల్లించవలెను. టెండర్లు రేఒక ఐటమునకైనను లేక అన్నిటికి టెండర్లు పంపవచ్చును.

**పర్సన్ - ఇన్ - చార్జి**

# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

**పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటు (ప్రాజెక్టు విభాగము)**

**శ్రీశైలం ప్రాజెక్టు సివిల్ సర్కిలు**

## టెండరు నోటీసు నెం. 19 SE/74-75

1. ఈ దిగువ సుదహరించిన పనికిగాను, సీలువేసిన టెండర్లు శ్రీశైలం ప్రాజెక్టు సివిలు సర్కిలు, సూపరింటెండింగు ఇంజనీరు వారిచే శ్రీశైలం ప్రాజెక్టు కాలనీలో వారి కార్యాలయమునందు 27—12—1974 సాయంత్రం గం. 4—00 వరకు తీసుకొనబడును. అదేరోజున, సదరు టెండరులు సాయంత్రం గం. 4—30 ని.లకు సూపరింటెండింగు ఇంజనీరు వారిచే వారి కార్యాలయమునందు తెరువబడును.

| వ.నెం | పని పేరు | కంట్రాక్టు ఫారము | సుమారు ధరావత్తు | టెండరు ఫారముల ఖరీదు | కాంట్రాక్టు కాలపరిమితి |
|---|---|---|---|---|---|
| 1. | శ్రీశైలం ప్రాజెక్టు నందు 7,8 బ్లాకులలో కాంక్రీటు బక్కెట్ల నిర్మాణము. | ఎల్. ఎస్. | రు. 3360 | రూ—పై 31—20 | 4 నెలలు |

2. టెండరు ఫారముల ఖరీదు ఒక పర్యాయము చెల్లించిన పిదప, ఎట్టి పరిస్థితులలోను వాపసు చేయబడదు.

3. టెండరు ఫారముల కొరకు దరఖాస్తులు, సూపరింటెండింగు ఇంజనీరు, శ్రీశైలం ప్రాజెక్టు, సివిల్‌సర్కిలు వారిపేర, శ్రీశైలం డాం తూర్పుపోస్టు కర్నూలుజిల్లా, ఆంధ్రప్రదేశ్ చిరునామాకు పంపుకొనవలయును. టెండరు ఫారముల ఖరీదు శ్రీశైలం ప్రాజెక్టులో స్టేటు బ్యాంక్ఆఫ్ ఇండియా బ్రాంచిమీద "పేఅండ్ ఎక్కౌంట్సు ఆఫీసరు" శ్రీశైలం ప్రాజెక్టు వారి ఖాతాకు డ్రాఫ్టు చెల్లించి సదరు డ్రాఫ్టును దరఖాస్తుతో పంపవలయును.

4. టెండరు ఫారములకు దరఖాస్తులు తేది13—12—1974వ తేదీలోగా సంపుకొనవలయును.

5. టెండరు ఫారములు ఆఫీసు పనిచేయు కాలములో తేది 16—12—1974 నుండి 23—12—74 వరకు దొరుకును.

6. పై సుదహరించిన పనికిగాను 1, 2, 3వ తరగతి కంట్రాక్టరులుగా రిజిష్టరయినవారు, రిజిస్ట్రేషన్‌ఆర్డరు, జతపరచి, దరఖాస్తులు పెట్టుకొనవలెను.

**షరా:—** శ్రీశైలం ప్రాజెక్టు చీఫ్ ఇంజనీరు వారివద్ద రు 50,000 విలువగల ధరావతు కలిగియుండిన, సదరు డాంకు పూర్తిచేసిన కంట్రాక్టర్లు, పై సుదహరించిన ధరావత్తు క్రింద రూ 2240 చెల్లించుటకు అనుమతి యివ్వడమైనది.

శ్రీశైలం డాం తూర్పు పోస్టు, 11—11—1974.

**యస్. వి. లక్ష్మీపతిరావు,**
సూపరింటెండింగు ఇంజనీరు,
సివిల్ సర్కిలు.

# హిందూమహా సముద్రంలో విన్యాసాలపై అంకారా ప్రకటన

## — ఢిల్లీలో పరిశీలకుల వ్యాఖ్య

న్యూఢిల్లీ, నవంబరు 19: హిందూమహా సముద్రంలో నౌకా విన్యాసాలు జరపాలని కొన్ని నాటో రాజ్యాలు తలపెట్టినవని, పాకిస్థానీ నౌకలు కూడా ఆ విన్యాసాలలో పాల్గొంటాయనీ రక్షణమంత్రి శ్రీ స్వరన్ సింగ్ మొన్న ఆదివారం నాడు న్యూఢిల్లీలో హిందూమహాసముద్ర వ్యవహారాల మహాసభలో వెల్లడించడంతో, ఆ విన్యాసాలను గూర్చి నిన్న అంకారాలో గత్యంతరం లేక ఒక బహిరంగ ప్రకటన చేయవలసి వచ్చినట్లు కనిపిస్తోంది.

అమెరికా, బ్రిటన్, టర్కీ, ఇరాన్, పాకిస్తాన్ నౌకా దళాలకు చెందిన నౌకలు విన్యాసాలలో పాల్గొంటున్న విషయం, కరాచీ రేవుకు చేరుతున్న ఈ నౌకల అసాధారణ కార్యకలాపాలు కొంత కాలంగా తెలిసినవేనని న్యూఢిల్లీ అభిజ్ఞ వర్గాల వారు చెప్పారు.

వివిధ సంధుల ద్వారాను, సైనిక కూటముల ద్వారాను పాశ్చాత్య రాజ్యాలతో సంబంధాలు కలిగి ఉన్నప్పటికీ ఇటీవల సంవత్సరాలలో నిబంధ రాజ్యం ముసుగు వేసుకొనడానికి ప్రయత్నిస్తున్న పాకిస్తాన్, ఈ విన్యాసాలను గూర్చి తన ఆలిదేయ పాత్రను గూర్చి ప్రచారం చేసుకొనడానికి సిగ్గుపడుతున్నట్లుగా కనిపిస్తోంది.

శ్రీ స్వరన్‌సింగ్ గత ఆదివారంనాడుచేసిన వ్యాఖ్యతో ఈ విన్యాసాలను గూర్చి వెలువడిన మొట్టమొదటి బహిరంగ ప్రకటన. ఈ విన్యాసాలను సెంటో రాజ్యాల విన్యాసాలుగా పేర్కొంటూ నిన్న రాత్రి అంకారా నుంచి వెలువడిన ప్రకటనకు శ్రీ స్వరన్‌సింగ్ వ్యాఖ్యలే కారణంగా కనిపిస్తోంది.

ప్రచ్ఛన్న యుద్ధ ఫలితంగాను, పశ్చిమాసియాను సోవియట్ కమ్యూనిజం నుంచి రక్షించే లక్ష్యంతోనూ ఏర్పడిన సెంటో ప్రస్తుత విన్యాసాలకు కేవలం ముసుగుగా వినియోగించుకుంటున్నారన్న విషయం పరిశీలకులు గ్రహించారు. సెంటోలో భాగస్వాములైన టర్కీ, ఇరాన్, , పాకిస్తాన్ దేశాలు మూడు కూడా సోవియట్ యూనియన్‌తో సంబంధాలను అభివృద్ధి పరచుకుని, ఆ సంగతి బాహాటంగా చెప్పుకుంటున్న ప్రస్తుత తరుణంలో ఈ విన్యాసాలు జరుగుతున్నాయి.

ఒక పంక పశ్చిమాసియాలో రణగుణ ధ్వనులు చెలరేగుతున్నాయి. అరబ్ రాజ్యాలకు వ్యతిరేకంగా అమెరికా ఇస్రాయిల్‌కు కొత్తగా ఆయుధాలు సరఫరా చేసింది. చమురు ఉత్పత్తి చేసే దేశాలకు, అమెరికా నాయకత్వాన సంపన్న వంతమైన పాశ్చాత్య రాజ్యాలకు మధ్య సంఘర్షణ అవకాశాలు కనిపిస్తున్నాయి.

రుషికేష్, నవంబరు 19 : కేదార్‌నాద్ ఆలయం ద్వారాలను, శీతాకాలం సందర్భంలో వేదమంత్ర పఠనాల మధ్య మూసివేసినట్లు ఇక్కడికి సమాచారం చేరింది.

# బీహార్ ఆందోళన భావి కార్యక్రమం: జయప్రకాష్ ప్రకటన

పాట్నా, నవంబరు 19 : బీహార్ ఆందోళన కార్యక్రమం రెండవ దశగా బ్లాకు నుంచి జిల్లా స్థాయి వరకు ప్రతి జిల్లాలోను జనసంఘర్ష సమితులను, ఛత్ర సంఘర్ష సమితులను పటిష్టం చేయవలసినదిగా ప్రజలకు సర్వోదయ నాయకుడు శ్రీ జయప్రకాశ్‌నారాయన్ విజ్ఞప్తి చేశారు.

గాంధిమైదాన్‌లో జరిగిన బహిరంగ సభలో శ్రీ జయప్రకాష్ మాట్లాడుతూ, పాట్నాలో ఈ నెల 4న శాంతియుతంగా జరిగిన ప్రదర్శన ప్రజా విజయమన్నారు. మొదటి రవుండు తర్వాత మల్లయోధులు పుంజుకొనే రీతిని ప్రస్తుత ఉద్యమాన్ని నిర్వహిస్తున్న జనసంఘర్ష ఛాత్రసంఘర్ష సమితులు తమ తమ శాఖలను ప్రతి జిల్లాలోను ఏర్పాటు చేసుకుని పటిష్టం కానడానికి ప్రస్తుత వ్యవధిని వినియోగించుకోవాలని కోరారు.

ఇలాంటి సమితులు గ్రామాలలోను, ప్రతి పట్టణంలోని ప్రతి వీధిలోను కూడా ఏర్పాటు కావాలంటూ, నాయకత్వం కోసం దెబ్బలాడకుండా, ప్రజాసామాన్యానికి పరిస్థితిని వివరించడానికి తమ కాలాన్ని వినియోగించవలసినదిగా సమితుల సభ్యులకు శ్రీ జయప్రకాష్ సలహా యిచ్చారు.

ఉద్యమ నిర్వహణకుగాను కార్యకర్తలకు శిక్షణ యివ్వాలని కూడా ఆయన కోరారు. అఖిలభారత శాంతిసేన కన్వీనర్ శ్రీ నారాయణదేశాయ్ పర్యవేక్షణలో ఈ శిక్షణ కార్యక్రమం వచ్చే నెల ఆఖరుకు పూర్తికావలసి ఉన్నదనీ, కాని శ్రీ దేశాయ్‌ని బీహారు నుంచి ఇప్పుడు బహిష్కరించారనీ అన్నారు. దేశంలోని ప్రతి పౌరుని మాదిరిగా శ్రీ దేశాయ్‌కి కూడా ఎక్కడకయినా వెళ్ళే హక్కు ఉన్నదనీ, ఈయనపై నిషేధం రాజ్యాంగవిరుద్ధమనీ, ప్రజాస్వామ్య వ్యతిరేకమనీ శ్రీ జయప్రకాష్ విమర్శించారు.

పోటీ జనతా శాసనసభ ఏర్పాటు ఆందోళన కొత్త స్వరూపమనీ, ఇందుకు ప్రతి నియోజకవర్గంలోను జన, సంఘర్షఛాత్రసంఘర్ష సమితులఏర్పాటు అవసరమనీ అన్నారు. జనతా శాసనసభ ఎన్నికల నిర్వహణకు ఎన్నికల అధికారి కోసం తామింకా వెదుకుతున్నా, మన్నారు.

## శ్రీ జయప్రకాశ్ ఆరోపణ

పాట్నా, నవంబరు 19 : పాట్నాలో నవంబరు నాలుగవ తేదీన శాంతియుత ప్రదర్శకులపై ఒక్క రాయికూడా రువ్వడం జరుగలేదని, అయితే ఒక మేజిస్ట్రేట్‌కు, కొందరు పోలీసులకు రాళ్లవల్ల గాయాలయినట్లు సర్టిఫికెట్‌లు యివ్వవలసిందిగా డాక్టర్లను కోరడం జరిగిందని శ్రీ జయప్రకాశ్ ఆరోపించారు. అయితే అలాంటి వత్తిడులకు డాక్టరులు లొంగలేదని ఆయన వారిని అభినందించారు.

# మారుతీ సంస్థపై ఆరోపణలు: ప్రభుత్వం ఖండన

న్యూఢిల్లీ, నవంబరు 19 : హర్యానాలోని మారుతీ లిమిటెడ్‌వారు రిజర్వుబ్యాంకు ఆదేశాలను ఏవిధంగాను ఉల్లంఘించలేదని లోక్‌సభలో ప్రభుత్వంవారు పేర్కొన్నారు. మారుతీ సంస్థ బ్యాంకు ఆదేశాలను ఏరకంగాను ఉల్లంఘించలేదని తనకు తెలిసిందని ఆరోపణలుచేసిన శ్రీ మధులిమాయేకు ఆర్థిక ఉపమంత్రి శ్రీమతి సుశీలారోహట్గి చెప్పారు. శ్రీ లిమాయే ప్రస్తావించిన కొన్ని అంశాల పరిశీలించవలసిందిగా బ్యాంకును కోరడానికి ఆమె అంగీకరించారు.

రిజర్వుబ్యాంకు (సవరణ) బిల్లుపై చర్చకు శ్రీమతి రోహట్గి సమాధానంచెప్పారు. సభవారు బిల్లును ఆమోదించారు. రాజ్యసభవారు బిల్లును ఇదివరకే ఆమోదించారు.

రిజర్వుబ్యాంకువారి డిపాజిట్ పరిమితిని మారుతీ సంస్థ అధిగమించిందన్న తనఆరోపణకు మద్దతుగా శ్రీ లిమాయే కొన్ని అంకెలు చెప్పారు. బ్యాంకు పరపతి విధానాన్ని మంత్రి సమర్థించారు.

హుండీలు, ముల్తానీలు వంటి పరపతి సదుపాయాలు రెండు సంవత్సరాలలోగా అగిపోవాలన్నది ప్రభుత్వవిధానంగా ఆమె చెప్పారు.

# బీహార్ అసెంబ్లీ సస్పెన్షన్ వార్త: శ్రీ బారువా ఖండన

జైపూర్, నవంబరు 19 : బీహారు శాసనసభను కొద్దికాలంపాటు సస్పెండ్ చేసే ప్రతిపాదనను కాంగ్రెసుపార్టీ పరిశీలించగలదని పాట్నాలో మొన్న తాను చెప్పినట్లు కొన్ని పత్రికలలో వెలువడిన వార్తలను కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ డి.కె. బారువా ఖండించారు.

శ్రీ బారువా నిన్న రాత్రి ఇక్కడ పి. టి. ఐ. విలేఖరి అడిగిన ప్రశ్నకు జవాబిస్తూ, బీహారు శాసనసభను సస్పెండ్ చేసే ప్రతిపాదన ఏదయినా పరిశీలనలో వున్నదా అని తనను పాట్నాలో ప్రశ్నించారనీ, ఆ విషయం గురించి తనకు ఏమీ తెలియదనీ చెప్పానని అన్నారు.

# నాలుగు చక్కెర మిల్లులలో రు. 80 అదనపు కరవు భత్యం

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాద్, నవంబరు 19 : రాష్ట్రంలోని నాలుగు పెద్ద చక్కెర మిల్లులలో వున్న 2100 మంది పనివారికి ఈ నెల నుండి నెలకు రు. 80 అదనపు కరువు భత్యం, 1975 జనవరి నుండి మరి రు 20 లభిస్తాయి అని కార్మిక శాఖ మంత్రి శ్రీ టి. అంజయ్య ప్రకటించారు.

ఉయ్యూరు, తణుకు, చాగల్లు, చెల్లూరు పంచదార ఫ్యాక్టరీల యాజమాన్యంవారికి పనివారి సంఘాలకు ఒప్పందం కుదిరిందన్నారు. సంప్రదింపుల ద్వారా మిగతా పరిశ్రమల వారు కూడా సమస్యల పరిష్కరించుకోగలరన్న ఆశాభావాన్ని శ్రీ అంజయ్య వ్యక్తపరిచారు.

## శ్రీమతి గాంధి 57 వ జన్మదినం

న్యూఢిల్లీ, నవంబరు 19 : ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి నేడు 57వ జన్మదినోత్సవం జరుపుకొంటున్నారు. రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ అలీఅహ్మద్ నేడు హైదరాబాదుకు వెడుతున్నందున, నిన్న ప్రధాని ఇంటికి వెళ్లి ఆమెకు శుభాకాంక్షలు తెలియజేశారు. ప్రధానికి రాష్ట్రపతి గులాబిగుచ్చాన్ని బహూకరించారు.

# హిందూ మహాసముద్రంలో సెంటో విన్యాసాలు ప్రారంభం

అంకారా, నవంబరు 19 : పాకిస్తాన్, ఇరాన్, టర్కీ, బ్రిటన్, అమెరికా దేశాల నౌకాదళ విన్యాసాలు నిన్న ప్రారంభమైనట్లు, ఇక్కడ అధికారయుతంగా ప్రకటించారు. ఇంత భారీయెత్తున విన్యాసాలు హిందూమహాసముద్రంలో ఇంతవరకు జరగలేదు.

ఈ విన్యాసాలకు పాకిస్తాన్ నౌకాదళం అతిథిగా వున్నట్లు 'సెంటో' కార్యాలయం నుంచి వెలువడిన ప్రకటనలో పేర్కొన్నారు.

సెంటో రాజ్యాలు ప్రతి ఏటా జరిగే రక్షణ కార్యక్రమాలలో ఇది భాగమని కూడా పేర్కొన్నారు. ఈ విన్యాసాలు ఈ నెల 30వ తేదీ వరకు జరుగుతాయి. యుద్ధకాలం పరిస్థితులలో మాదిరిగా వ్యవహరిస్తారు. జలాంతర్గామి నిరోధక విన్యాసాలు, వైమానికదళాల రక్షణ విన్యాసాలు మొదలైనవి జరుగుతాయి. ఈ విన్యాసాలలో రెండు అణు జలాంతర్గాములు, ఒక విమాన వాహక నౌక కూడా పాల్గొంటున్నాయి.

## పరిశ్రమలపై లెవీ విధించే ఆలోచన

బొంబాయి, నవంబరు 19 : ప్రజల అవసరాలకు తగిన మేరకు సరఫరాలు చేసేందుకుగాను అత్యవసర పారిశ్రామిక వస్తువులకు సంబంధించి ఉత్పత్తిదారులపై లెవీ విధించే సమస్యను పరిశీలించడానికి కేంద్ర పారిశ్రామిక, పౌరసరఫరా శాఖ మంత్రి శ్రీ టి. ఎ. పయి నిన్న తాము సంసిద్ధంగా ఉన్నట్లు చెప్పారు.

బొంబాయిలో అత్యవసర వస్తువులకు సంబంధించిన పంపిణీ విధానాన్ని రూపొందించడం గురించి బొంబాయి ప్రదేశ్ కాంగ్రెస్ సంఘం ఏర్పాటు చేసిన సదస్సును శ్రీ పయి ప్రారంభిస్తూ, సరసమైన ధరలకు, సమంజసమైన ప్రమాణాలతో ఉత్పత్తి కొనసాగేటట్లు చూడడంతమ ప్రధానఉద్దేశమన్నారు.

# ప్రధాని సవాల్ ఆమోదానికి జయప్రకాశ్ సంసిద్ధత

పాట్నా, నవంబరు 19 : వచ్చే ఎన్నికలలో ప్రజల తీర్పుకోరవలసిందిగా ప్రధాని చేసిన సవాల్‌ను తాను అంగీకరిస్తున్నానని సర్వోదయనాయకుడు శ్రీ జయప్రకాశ్‌నారాయణ నిన్న ఇక్కడ చెప్పారు.

తానుకూడా తొందరపడడం లేదని ఇక్కడ బ్రహ్మాండమైన బహిరంగ సభలో ఆయన అన్నారు. ప్రజావాణికి తలఒగ్గవలసి వుంటుందని, అధికారంలోవున్నవారు గద్దెదిగవలసి ఉంటుందని ఆయన అన్నారు. ఈ మార్పు పాట్నాలోనే కాదని, ఢిల్లీలో కూడా వస్తుందన్న అభిప్రాయాన్ని ఆయన విదితం చేశారు.

ఇందిరాగాంధి చాలా తెలివిగల రాజకీయవేత్తలని శ్రీ జయప్రకాశ్ అన్నారు. ఎన్నికలను రణరంగంగా తయారుచేసే సన్నాహం ఆమెచేస్తున్నారన్నారు. ఆమె ప్రజావాణిని వినగలరని అన్నారు. ఈ పోరాటంలో సామాన్య ప్రజ, విద్యార్థులు, యువజనులు ఒక వంక వుంటారని, వారిని వ్యతిరేకించే కాంగ్రెసు, కమ్యూనిస్టువంటివారు వేరొక వంక ఉంటారని ఆయన అన్నారు.

తాను అభ్యర్థిగా ఉండనని నాయకత్వం వహిస్తానని చెప్పారు.

## నవసమాజ నిర్మాణం: శ్రీ రఘునాధరెడ్డి సలహా

హోస్పేట. నవంబరు 19 : కార్మికులు యువకులు, రైతులు, విద్యార్థులు సమైక్యతతో ధనికుల దోపిడిని ఎదిరించినప్పుడు నేటి ధనికస్వామ్య వ్యవస్థను మార్పు చేయవచ్చునని కేంద్ర కార్మికమంత్రి శ్రీ హెచ్. రఘునాధరెడ్డి నిన్నిచ్చట చెప్పారు.

రైతు, కార్మిక, వ్యవసాయ కూలీలసభలో శ్రీ రెడ్డి ప్రసంగిస్తూ 27 సంవత్సరముల స్వాతంత్ర్యం తర్వాతకూడా దేశప్రజలలో 50 శాతం పేదరికంకంటె తక్కువ స్థాయిలో జీవిస్తూ వుండడం శోచనీయమని అన్నారు.

దేశంలో నిరుద్యోగం పెరిగిపోతూ వుంటే కొందరు చక్కెర, బవుళి పారిశ్రామిక వేత్తలు ఉత్పత్తిని, విస్తరణ కార్యక్రమాలను తగ్గించాలని చూస్తూ వుండడం శోచనీయమన్నారు. సామాన్య ప్రజలకు అందుబాటులో లేనంతగా వస్త్రాల ధరలు పెరిగినందునే దేశంలో వస్త్రాల నిల్వలు పెరిగిపోయినవని చెప్పారు.

# గార్సియాలో అమెరికా స్థావర నిర్మాణం: బ్రిటన్ ఆమోదించే సూచన

లండన్, నవంబరు 19 : డిగోగార్సియాలో నౌకా స్థావరం నిర్మాణానికి, విస్తరణకు అమెరికా చేసిన విజ్ఞప్తిని బ్రిటన్ ఆమోదించగలదని నమ్మకంగా తెలుస్తున్నది.

ఈ విషయమై లేబరు ప్రభుత్వం ఇంకా తుది నిర్ణయం తీసుకోలేదు.

దక్షిణాఫ్రికాలోని సైమన్స్ టవున్ నౌకా స్థావరం ఒప్పందం పొడిగించబడే అవకాశాలు స్వల్పమైనందున గార్సియా స్థావరం నిర్మాణానికై అమెరికాకు బ్రిటన్ అనుమతిఇవ్వడం ఖాయమని పరిశీలకులు పేర్కొన్నారు.

హిందూమహాసముద్రంలో రష్యా నౌకాబలం పెరుగుదలకూడా బ్రిటన్ వైఖరికి కారణమని తెలుస్తున్నది.

సైమన్స్ టవున్ ఒప్పందం కొనసాగింపునకు బ్రిటన్‌లో రాజకీయపక్షాలవారు వ్యతిరేకిస్తున్నారని ప్రభుత్వ ప్రతినిధులు తెలియజేశారు. డిగోగార్సియా విషయంలో పెద్దగా వ్యతిరేకత కనిపించడంలేదు. కాని కామన్వెల్త్ దేశాల నుంచి గట్టి వ్యతిరేకత వున్నది.

గార్సియా దీవిని అమెరికాకు అప్పగించవద్దని భారత్, శ్రీలంక, మారిషస్‌లు ఇటీవల బ్రిటిష్ ప్రభుత్వాన్ని గట్టిగా కోరాయి. హిందూ మహాసముద్రంలో అమెరికా నవుకాబలం శాశ్వతంగా తిష్టవేయడానికి గార్సియా దీవిని కోరుతున్నదని భారత ప్రభుత్వం ఒక ప్రకటనలో పేర్కొన్నది.

హిందూ మహాసముద్ర ప్రాంతంలో బ్రిటన్ తన ప్రయోజనాలను రక్షించుకోడానికి ప్రయత్నిస్తున్నప్పటికీ, మరో ప్రక్క కామన్వెల్తు దేశాల విమర్శలకు గురి అవుతున్నది. అయినా తన స్వప్రయోజనాల రక్షణకే ప్రాధాన్యం ఇవ్వగలదని తెలుస్తున్నది.

హిందూ మహాసముద్రంలో రష్యా నవుకల ఉనికి గురించి, గార్సియా దీవి అభివృద్ధి గురించి అమెరికా, బ్రిటన్ ప్రతినిధులు గత అక్టోబరులో వాషింగ్టన్‌లో దీర్ఘమైన చర్చలు జరిపారు. ఈ చర్చల ఫలితాలను పురస్కరించుకుని గార్సియా విషయమై బ్రిటిష్ ప్రభుత్వం పరిశీలిస్తున్నది.

—o:o—

## ఎ. ఐ. కార్మికులకు హెచ్చు వేతనాలు

బెంగుళూరు, నవంబరు 19: హిందూస్తాన్ ఏరోనాటిక్స్‌కు చెందిన బెంగుళూరు, నాసిక్, హైదరాబాదు, కాన్పూరు, లక్నో, బ్యారక్‌పూర్ కేంద్రాలలో పనిచేస్తున్న 34వేలమంది పనివారికి హెచ్చు స్కేళ్లతో వేతనాలు, డి.ఎ, ఇంటిఅద్దె అలవెన్సు కూడా ఇక్కడ కుదిరిన ఒప్పందం వల్ల వస్తుంది. దీనివల్ల కంపెనీకి ఆరుకోట్లు అదనంగా ఖర్చు అవుతుంది.

## భారత్—పాకిస్తాన్ అధికారుల చర్చ

న్యూఢిల్లీ, నవంబర్ 19 : భారత్, పాకిస్తాన్‌ల మధ్య విమానయాన పునరుద్ధరణ గురించి ఉభయదేశాల అధికారులు నిన్న రావల్పిండిలో రెండు దఫాలు చర్చలు జరిపారు. చర్చలు సుహృద్భావవాతావరణంలో జరిగినట్లు ఉభయదేశాల ప్రతినిధివర్గాల నాయకులు శ్రీ ఎస్. సెహగల్, మేజర్ జనరల్ ఫజల్—ఎ—ముఖింఖాన్ చెప్పారని పాకిస్తాన్ రేడియో పేర్కొంది.

## హైకోర్టులలో కేసుల నిల్వలు: న్యాయమూర్తి జగన్మోహనరెడ్డి ఆందోళన

పూర్ణియా, నవంబరు 19: వివిధ హైకోర్టులలో అన్నిరకాల కేసులు పేరుకొనిపోవడంపట్ల న్యాయమూర్తి శ్రీ పి. జగన్మోహనరెడ్డి తన తీవ్ర ఆందోళనను వ్యక్తం చేశారు.

డార్జిలింగ్ నుంచి కారుమీద పూర్ణియా మీదుగా ఢిల్లీవెడుతూ ఇక్కడ శ్రీ రెడ్డి ఇచ్చిన ఇంటర్వ్యూలో అన్నిటికంటె అలహాబాదు హైకోర్టులో హెచ్చు కేసులు చిరకాలంగా నిల్వవున్నాయన్నారు.



## అంగలూరు గ్రామపంచాయితీ టెండరు నోటీసు

కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా అంగలూరు గ్రామ పంచాయితీ ఏరియాలో రు. 10730 ఎస్టిమేటు విలువ గల్గిన క్వారీ రబ్బీషు మెటల్ రోడ్లు పనులు చేయుటకు, 100 కొబ్బరి మొక్కలు (Hybrid type) వివరములతో సహా సప్లయి చేయుటకు 29—11—74 మ. 3 గంటలకు పంచాయితీ ఆఫీసునందు టెండర్లు స్వీకరించబడును. రోడ్ల పనులకు ఎస్టిమేటు విలువలో 5 శాతం మరియు కొబ్బరి మొక్కలకు రు. 50 డిపాజిట్టు చెల్లించవలసియున్నది.

**ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్,**
అంగలూరు గ్రామ పంచాయతి.

## ప్రకటన

నా క్లయింటు దావులూరి బసవరత్నమ్మగారి భర్త విశ్వనారాయణగారు నిస్సంతుగాను మరణ శాసనము వ్రాయకుండా విజయవాడలో 13—2—73న మరణించినారు. వారి తాలూకు చరస్థిరాస్తులన్నియు వారి ఏకైక వారసురాలైన నా క్లయింటుకు చట్టరీత్యా సంక్రమించినవి. వ్యవహార జ్ఞాన శూన్యత, అమాయకత్వము, సంతకము తప్ప విద్యాశూన్యత మొదలగు నా క్లయింటు దుర్బలత్వములను ఆసరా చేసుకొని దురుద్దేశ్యంతో చెంగల్పట్టు జిల్లా అత్తిపట్టు గ్రామ కాపురస్తులని భోగరాజు వెంకటరత్నం అనేవ్యక్తి నాక్లయింటు కుటుంబమునకు చిరకాలపరిచయుడనిన్ని, సన్నిహితుడనిన్ని, శ్రేయోభిలాషిననిన్నిమోసపుమాటలతోనాక్లయింటును నమ్మించి, ఆమె తాలూకు యావద్వ్యవహారములు నిర్వహించెదనని చెప్పి 26.3.74 తేదీన కుయుక్తిలో ఆమెవలన రిజిష్టర్డు జనరల్ పవర్‌ను పొంది, మోసముతో నా క్లయింట్‌చే తెల్ల కాగితములపైన, వ్రాసిన కాగితములపైన Blank బ్యాంకు చెక్కులపైన సంతకములుచేయించి సదరు సొమ్మును శ్రీ వెంకటరత్నము అక్రమముగా పొంది వివరములు చెప్పకుండా ఉన్నాడనియు, వారి పేరన వ్రాయించిన జనరల్ పవర్‌ను రద్దు పరచుచు లీగల్ నోటీసు యిప్పించియున్నందున్ను, వారి వద్దనున్న సంతకములు ఏ ఏ రూపములనైన ఉపయోగించినన్ను, వారితో ఎవ్విధమైన ఏర్పాటులు ఎవరైన జరిగించినచో అట్టివి చెల్లనేరవనియు, నా క్లయింటును బైండ్ చేయవనిన్ని, నా క్లయింటు తీర్మానించవలసిన Laibilitiesఏవి:లేవనియు వారి నడవడి మోసము దురుద్దేశ్యములతో కూడి ఉన్నందున వారిపై నా క్లయింటు సివిల్ క్రిమినల్ చర్యలు జరుపుటకు సిద్ధముగా ఉన్నదని యావన్మందికి ఇందుమూలముగా తెలియపరచడమైనది.

టి. ఎల్. నరసింహారావు, అడ్వొకేటు.



# ఇండియన్ షుగర్ ఇండస్ట్రీ ఎక్సుపోర్టు కార్పొరేషన్ లి॥

21, కమ్యూనిటీ సెంటర్, ఈస్ట్‌కోస్ట్ ఆఫ్ కైలాస్, న్యూఢిల్లీ—110024.

## టెండరు నోటీసు

### తెల్లపంచదార అమ్మకము

విశాఖపట్నం పోర్టునందు గల మా గోడవునవద్ద "ఉన్నది ఉన్నట్లే ఉన్న విధముగా" యీ క్రింద వివరింపబడిన తెల్లపంచదార బస్తాలుగా విక్రయింపబడును.

కొంతభాగం తడిసినవి: — 82 బస్తాలు
తడి పంచదార — 319 బస్తాలు.

ఈ కొనుగోలునందు ఆసక్తిగల వ్యక్తులు విశాఖపట్నము వద్ద మా క్లియరింగు ఏజంట్లయిన మెసర్స్ ప్యారీ & కంపెనీ లిమిటెడ్, నెం. 30—12—3/1, రంగావీధి, డాబా గార్డెన్స్, పి. బి నెం. 14,విశాఖపట్నం—4 వారితో సంప్రదించిన యెడల, వారు యీ సరుకు తనిఖీకి యేర్పాట్లు చేయగలరు. అఫర్లన్నియు నిర్ణీత ఫారములోనే దాఖలు చేయవలెను. సదరు ఫారములు పొందగోరువారు వానిని, మా పై ఆఫీసునుండిగాని— రంగావీధి డాబాగార్డెన్స్, విశాఖపట్నం నందుగల మా క్లియరింగ్ ఏజెంట్ల ఆఫీసు నుండిగాని పొందవచ్చును. అఫర్లు విశాఖపట్నము నందలి మా క్లియరింగ్ ఏజెంట్ల ఆఫీసునందు తేదీ 2—12—1974 సా. 3 గంటలకుమించక డెలివరీ చేయవలెను. ఈ అఫర్లు అటుపైన వెంటనే తెరువబడును.

**ఎస్. ఎస్. రైనా,**
(మేనేజరు)

## ఆచంట వేమవరం గ్రామపంచాయితీ టెండరు నోటీసు

నర్సాపురం తాలూకా ఆచంట వేమవరం గ్రామ పంచాయితీ కార్యనిర్వాహణాధికారిచే 30—11—1974వ తేదీ సాయంత్రం 4—00 గం. వరకు యీ క్రింద సుదహరించిన పనులకు సీలువేసిన టెండర్లు తీసుకొనబడును. అదే తేదీ 4—30 గంటలకు హాజరుగాకుల టెండరు దారుల సమక్షములో టెండర్లు తెరువబడును. టెండర్లు దాఖలు చేయువారు నిర్ణయించిన డిపాజిట్టును చెల్లించి టెండరు షరతులకు లోబడి దాఖలు చేయవలెను. యితర వివరములు ఆఫీసు పనిచేయు కాలములో తెలుసుకొనవచ్చును.

1. సమితి ఎలిమెంటరీ స్కూలు బిల్డింగు మిగిలిన పని చేయుట :
   ఎస్టిమేటు రు. 7000/—
   టెండరు డిపాజిట్టు : రు. 350/—
2. హైవేజు రోడ్డునుండి P.H.C.వరకు అప్రోచిరోడ్డుకు రబ్బీషు వేయుట :
   ఎస్టిమేటు మొత్తము రు. 1500/—
   టెండరు డిపాజిట్టు రు. 75/—

**(సం యం. రామకృష్ణారావు,**
కార్యనిర్వాహణాధికారి, ఎ. వేమవరం.

# ఆసియా రికార్డు

**భారత రాష్ట్రపతి : గౌ॥ శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహ్మద్**

**నేటి ఉదయం 11-16 గంటలకు**

ఆసియాలోకే మిక్కిలి పొడవైనటువంటి

## రైలు-రోడ్డు వంతెనకు (2.9 కి.మీలు)

**రాజమండ్రి వద్ద ప్రారంభోత్సవం చేయుదురు.**

ఈ ఉత్సవంలో

రైల్వే మంత్రి గౌ. శ్రీ ఎల్. ఎన్. మిశ్రా

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌ. శ్రీ జె. వెంగళరావు

పాల్గొందురు.

*ఈ వంతెన నిర్మాణం పూర్తిగా భారతీయ మేధస్సుతోనూ పూర్తి స్వదేశీ పరికరాలతో మొట్టమొదటగా నిర్మించబడినది*

# చీరాల తాలూకాలో ప్రత్తి చేలకు ఎరువులు: రంగారెడ్డి వాగ్దానం

చీరాల, నవంబరు 19 : చీరాలతాలూకా లోను, పరుచూరు ప్రాంతాలలోను 74 వేల ఎకరాలలో సాగవుతున్న ప్రత్తి పంటకుఎక్కువ ఎరువులు సరఫరా అయ్యేట్లు చేయడంలో తాను సహాయపడగలనని ఆర్థికమంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి వాగ్దానం చేశారు.

మొన్న మధ్యాహ్నం పరుచూరులో జరిగిన బహిరంగ సభలో శ్రీ రంగారెడ్డి ప్రసంగిస్తూ సాగర్ ప్రాజెక్టు ఆయకట్టు క్రింద సాగు లాయకయిన మెట్ట భూములను ఇంకా ఎక్కువగా చేర్చే అవకాశాన్ని ప్రభుత్వం పరిశీలిస్తోందని అన్నారు. సాగర్ ప్రాజెక్టును పూర్తి చేయుదానికి మరో 100 కోట్ల రూపాయిలు అవసరమని, ప్రాజెక్టు పూర్తి అయితే 24 లక్షల ఎకరాలు సాగవుతాయని ఆయన చెప్పారు. ఎరువుల విషయంలో రాష్ట్రానికి తక్కువ కోటా వస్తున్న మాట నిజమే నని ఆయన అంగీకరించారు. కోటాను పెంచ వలసిందిగా కేంద్రాన్ని కోరామని అన్నారు. ప్రకాశం జిల్లాలో పొదిలి, కందుకూరు, దరిశి తాలూకాలలో మంచినీటి కొరత తీవ్రంగా ఉన్నదని సాగర్ కాలువల ద్వారా మంచినీటిని సరఫరా చేయడానికి చర్యలు తీసుకోగలమని ఆయన ప్రకటించారు. ఈ నెల 23న ఒంగోలులో జరిగే జిల్లా మహాసభలో జిల్లా సమస్యల గురించి చర్చించడం జరుగుతుందని ఆయన చెప్పారు.

శాసన సభ్యుడు శ్రీ ఎం. నారాయణరావు మాట్లాడుతూ, సాగర్ కాలువ నీటిని పది, పదకొండు బ్లాకులకు కూడా సరఫరా చేయాలని, దీనివల్ల 40 వేల ఎకరాలు సాగు కాగల వని చెప్పారు. మాజీ శాసన సభ్యుడు శ్రీ కె. రామయ్య ఎరువులు, చక్కెర పంపిణీ విధానాన్ని విమర్శించారు. సమితి అధ్యక్షుడు శ్రీ డి. సూర్యనారాయణ స్వాగతపత్రం సమర్పించారు. (స్వ. వి)

## ఉలవపాడు సమితిలో

ఒంగోలు, నవంబరు 19 : శ్రీ రంగారెడ్డి ఈ నెల 16న ఉలవపాడు సమితి సమావేశంలో ప్రసంగించారు.

రాష్ట్రంలో హరిజనుల గృహాల నిర్మాణం సమస్యను పరిష్కరించడానికి చర్యలు తీసుకొంటున్నామని, హరిజనుల గృహ నిర్మాణానికి రూ 50 కోట్లు అవసరమని చెప్పారు. మాజీమంత్రి శ్రీ ఎన్. వెంచురామానాయుడు సభకు అధ్యక్షత వహించారు. శ్రీ పులి వెంకటరెడ్డి (ఎం.పి) శ్రీ ఆరేటి కోటయ్య (ఎం. ఎల్. ఏ) శ్రీ బి. వెంకటసుబ్బయ్య (సమితి అధ్యక్షుడు) ప్రసంగించారు. (స్వ. వి)

## వెలిగండ్ల

శ్రీ రంగారెడ్డి వెలిగండ్ల సమితి సమావేశంలో మాట్లాడుతూ, పంచాయితీరాజ్ సంస్థలు తమ వనరులను పెంపొందించుకొని, ప్రజలకు మరింత ఉత్తమమయిన రీతిలో సేవ చేయాలని సూచించారు.

శ్రీ పులివెంకటరెడ్డి (ఎం. పి) శ్రీ ఎస్. పాపిరెడ్డి (ఎం. ఎల్. ఏ) శ్రీ వి. పిచ్చిరెడ్డి ప్రసంగించారు.

కనిగిరి సభలో కూడా శ్రీ రంగారెడ్డి మాట్లాడారు. శ్రీ జి. తిరుపతినాయుడు ప్రభృతులు ప్రసంగించారు.

## పొదిలిలో

శ్రీ రంగారెడ్డి పొదిలి సమితి సమావేశంలో మాట్లాడుతూ పోచంపాడు, వంశధార, శ్రీశైలం తదితర ప్రాజెక్టుల నిర్మాణాన్ని పూర్తి చేయడానికి కేంద్రం సహాయాన్ని కోరామన్నారు. దర్శితాలూకాలో 32 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరాపని రెండేళ్లలో పూర్తి కాగలదన్నారు.

ఆ తర్వాత జరిగిన బహిరంగ సభలో శ్రీ కాటూరినారాయణస్వామి (ఎం. ఎల్. ఏ) శ్రీ కాశిరెడ్డి (సమితిఅధ్యక్షుడు) శ్రీ పులి వెంకటరెడ్డి (ఎం. పి) స్థానిక సమస్యలను ఆర్థిక మంత్రికి వివరించారు.

శ్రీ రంగారెడ్డి ఎర్రగొండపాలెం, సమితి సమావేశంలో మాట్లాడుతూ భూములు పొందిన నిరుపేదలు వాటిని సక్రమంగా సాగుచేయాలని చెప్పారు. సభకు శ్రీ పి. వెంకటరెడ్డి అధ్యక్షత వహించారు. సమితి అధ్యక్షుడు శ్రీ వి. కోటయ్య వ్యవసాయానికి విద్యుత్ సరఫరా చేయాలని కోరారు. జిల్లా పరిషత్ ఉపాధ్యక్షుడు శ్రీ ఎం. భాస్కరరెడ్డి కూడా మాట్లాడారు.

## మార్కాపురంలో

మార్కాపురంలో గతగురువారం నాడు జరిగిన సభలో శ్రీ రంగారెడ్డి ప్రసంగిస్తూ పట్టణ ప్రాంతాలలో నిరుద్యోగం సమస్యను నివారించడానికి పారిశ్రామికాభివృద్ధి ఒక్కటే మార్గమని చెప్పారు. మార్కాపురంలో పలకల పరిశ్రమ అభివృద్ధికి కృషి జరుగగలదని చెప్పారు.

మార్కాపురం సమితి సమావేశంలో కూడా ఆయన ప్రసంగించారు.

## ఒంగోలులో

ఒంగోలులో మొన్నరాత్రి జరిగిన బహిరంగ సభలో శ్రీ పిడతల రంగారెడ్డి ప్రసంగింతారు. వెనుకబడిన జిల్లా అయిన ప్రకాశం జిలా అభివృద్ధికి అన్ని విధాలా కృషి జరగగలదని ఆయన హామీ యిచ్చారు.

సభకు శాసన మండలి అధ్యక్షుడు శ్రీనివరి, వెంకటసుబ్బయ్య అధ్యక్షత వహించారు. శ్రీ పులి వెంకటరెడ్డి, శ్రీ ఆరేటి కోటయ్య ప్రభృతులు ప్రసంగించారు.

# సంక్షేమ పథకాల అమలుకై అవసరమైతే సంపన్నులపై అదనపు పన్నులు: ఆర్థికమంత్రి సూచన

చీరాల, నవంబరు 19 : మిగులుభూమి పేదవారికి పంపిణీ చేసే కార్యక్రమం రెండు మూడేళ్ళలో పూర్తి కాగలదని ఆర్థికమంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి మొన్నరాత్రి వేటపాలెం పంచాయితీసమితి 15వ వార్షికోత్సవ సభలో చెప్పారు. సంక్షేమ పథకాల అమలుకు గాను అవసరమైతే సంపన్న వర్గాలపై అదనపుపన్నులు వేయగలమని ఆయన సూచించారు. త్వరలో రానున్న పంచాయితీ చట్టం సమితి అధ్యక్షులకు విస్తృతాధికారాలు ఇవ్వడమేకాకుండా పన్నుల వసూలులో బాధ్యత పెంచగలదని ఆయన అన్నారు.

ప్రకాశంజిల్లా పరిషత్ ఉపాధ్యక్షుడు శ్రీ ఎం. భాస్కరరెడ్డి సభకు అధ్యక్షత వహించారు. వేటపాలెం సమితి అధ్యక్షులు రొండా రామస్వామిరెడ్డి వినతిపత్రం సమర్పిస్తూ ఈ సమితిని సామాన్యస్థాయిలోవుంచి, నిర్మాణపు పనులకు గ్రాంటులు కొనసాగించాలని కోరారు.

అంతకుముందు మంత్రి శ్రీ రంగారెడ్డి జాండ్రపేటలో కాంగ్రెసు కార్యకర్తల సభలో మాట్లాడారు. శ్రీ పి. రాఘవరెడ్డి సభకు అధ్యక్షత వహించారు.

పంచాయితీరాజ్యశాఖ మంత్రి శ్రీ లుకలాపు లక్ష్మణదాసు సభలో మాట్లాడుతూ త్వరలో సవరించనున్న పంచాయితీరాజ్య చట్టం క్రింద పంచాయితీసమితి సభ్యులు, అధ్యక్షుడు, సమితి అధ్యక్షులు, జిల్లా పరిషత్ అధ్యక్షుల ఎన్నికలు ఒకేరోజు జరుగుతాయని, ఈ చట్టం పంచాయితీరాజ్య వ్యవస్థను పునరుజ్జీవింప చేయగలరని అన్నారు.

మంత్రి శ్రీ రంగారెడ్డి మొన్న ఇక్కడకు సమీపంలోని ఎర్రంవారిపాలెంవద్ద అచ్చమాంబ పంచాయితీసమితి ప్రాథమిక పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం చేశారు పంచాయితీవారు నిర్మించిన తూముకు, శ్రీ పి. అంబిరెడ్డి విరాళంతో నిర్మించిన గ్రంథాలయ భవనానికి కూడా మంత్రి ప్రారంభోత్సవం చేశారు. శ్రీ పి. శ్రీనివాసరావు సభకు అధ్యక్షత వహించారు. శ్రీ బి. వెంకటరెడ్డి, బి. వెంకటేశ్వరరెడ్డి కూడా మాట్లాడారు. (స్వ.వి.)

## వెండి, బంగారం ధరలు:

నవంబరు 19 :

| | | |
|---|---|---|
| బొంబాయి మార్కెట్ | | |
| వెండి రెడీ | రు. | 1145—00 |
| బంగారం | రు. | 534—00 |
| కలకత్తా మార్కెట్ | | |
| వెండి రెడీ | రు. | 1125—00 |
| హైదరాబాదు మార్కెట్ | | |
| వెండి 1 కిలో | రు. | 1100—00 |
| „ 10 గ్రా. | రు. | 11—50 |

## ఈపూరుపాలెం

చీరాల, నవంబరు 19 : ఈపూరుపాలెం పంచాయితీకి శ్రీ రామారావు అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నికయూరు. (స్వ.వి.)



















Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.